శ్రీమతే రామానుజాయ నమః

శ్రీమద్వరవరమునయే నమః



# సాంప్రదాయిక వ్యాస మాలిక – ౬

గుణపరీవాహం,

శ్రీమణవాళ మహామునుల 'వేదాంతసారనిష్కర్షం',

గాయత్రీమంత్రార్థవిచారం,

ఊర్ధ్వపుండ్రమహిమ,

తాపసంస్కారమహిమ,

విశిష్టాద్వైతమతం చాలా ప్రాచీనమైనది,

ఉపనిషత్తులు - విశిష్టాద్వైత సిద్ధాంతం,

ఆళ్వార్ల పాశురాలలో అలంకారాలు


**అనువాదకులు:**

'పండిత రత్న' ఉ.వే.శ్రీమాన్ ఈయుణ్ణి అళగ శింగరాచార్యులు

**సంపాదకుడు:** ఈయుణ్ణి అనంత రంగ రామన్


29-12-2021

## విషయసూచిక:



సంప్రదాయార్థ సౌరభ్య వాసితా వ్యాసమాలికా,

సేయం జనయతాన్మోదం గుణవిజ్ఞమానసే.

# గుణపరీవాహం

*(తమిళ మూలం: ఉ.వే శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్యస్వామివారు)*

శ్రీపరాశర భట్టర్ భగవానుని అవతారాలను **"గుణపరీవాహ"** శబ్దంతో అనుభవించారు. **"గుణపరీవాహాత్మనామ్"** (గుణాల ప్రవాహ రూపాలు) అని వారి సూక్తి. **"జలోచ్ఛ్వాసాః పరీవాహాః"** (చెరువు నిండినప్పుడు ఆ చెరువులో నీరు బయటికి వచ్చే మార్గాలు పరివాహాలు) అని అమరకోశం పరీవాహశబ్దాన్ని వివరిస్తున్నది. **"పూరోత్పీడే తటాకస్య పరీవాహః పరిక్రియా"** (చెరువులో నీరు పైఅంచుల వరకు వచ్చినప్పుడు ఆ చెరు కట్ట పగిలిపోకుండా ఉండడం కోసం తూముల ద్వారా ఎక్కువగా ఉండే నీటిని బయటకు ప్రవహింప జేయడం పరిష్కారం) అని ఉత్తరరామ చరిత్ర నాటకంలో భవభూతి వచనం. **"తటాకాంతే ప్రవృత్తజలనిర్గమనాయ కృతమార్గః పరీవాహః"** (చెరువులో నీరు పొంగిపొర్లినప్పుడు ఎక్కువగా ఉండే నీటిని బయటకు ప్రవహింపజేయడం కోసం ఏర్పరిచిన మార్గం పరీవాహం అనబడుతుంది) అని ఆ సూక్తి వివరింపబడింది. భగవంతుడు సమస్త కళ్యాణగుణపూర్ణుడు. అతనిలో నిండుగా ఉండే కళ్యాణ గుణాలు వ్యక్తం అయ్యే మార్గాలు అవతారాలు అని చెప్పబడుతున్నాయి. తటాకం నీటితో నిండగానే మిగిలిన నీరు కాలువల ద్వారా బయటకు వస్తేనే ఆ చెరువు నిలుస్తుంది. లేకపోతే ఆ చెరువు కట్ట బద్దలయిపోతుంది. ఆ విధంగానే భగవానునకు ఉండే నిండైన కళ్యాణగణాలు వ్యక్తమయ్యే కాలువలే అవతారాలు. ఆ అవతారాలను ఎత్తకపోతే అతడు నిలువలేడు అని ఇక్కడ భావం.

భగవద్రామానుజ సిద్ధాంతంలోని మఖ్యమైన అర్థాలలో—పరమాత్మ స్వరూపం సత్యం, నిత్యం. ఆ విధంగానే అతని కల్యాణగుణాలు కూడా సత్యాలు, నిత్యాలు అనేది కూడా ఒకటి. **"ఉయర్వఱ ఉయర్ నలమ్ ఉడైయవన్"** (సాటిలేని గొప్పతనాన్ని కల ఉన్నతమైన ఆనంద గుణాన్ని కలవాడు) అని నమ్మాళ్వార్లు, **"స్వాభావికానధికాతిశయాసంఖ్యేయ కల్యాణగుణగణః"** (సహ–

జమైన, అంతులేని గొప్పతనాన్ని కల, లెక్కలేనన్ని కల్యాణగుణాలను కలవాడు) అని యామునులు, **"దోషోపధావధిసమాతిశయానసంఖ్యానిర్లేపమంగళగుణౌఘదుఘాః"** (దోషా-లను, ఉపాధిని, పరిమితిని, సామ్యాన్ని, తనకంటే గొప్పతనాన్ని, సంఖ్యను లేనివి, పాప సంబంధాన్ని లేని కల్యాణ గణాలకు మూలమైనవి అయిన జ్ఞానం మొదలైన ఆరు గుణాలు) అని భట్టర్ ఈ విషయాన్ని పలకడం ప్రసిద్ధమే కదా! ఈ కల్యాణగుణాల పరీవాహాలే భగవదవతారాలు.

భగవంతుని నామాలలో అనంతుడు అనేది ఒకటి. **"నాంతం గుణానాం గచ్ఛంతి తేనానంతోఽయమవ్యయః"** (కళ్యాణగుణాలకు అంతు లేదు గనుక అనంతుడు అని భగవంతుడు చెప్పబడుతున్నాడు) అనే విధంగా భగవంతుని గుణాలకు అంతులేదు. **"ఈఱిల వణ్ పుకழ்"** (సాటిలేని గొప్ప కళ్యాణ గుణాలను కలవాడు), **"ఉలప్పిల్ కీర్తి"** (సాటిలేని కీర్తిని కలవాడు) అని ఈ విషయాన్ని ఆழ்వార్లు తెలిపారు. కళ్యాణగుణాలకు అంతం లేనట్లే, ఆ కళ్యాణగుణాలకు కాలువలవంటి అవతారాలకు కూడా అంతు లేదు. **"అజాయమానో బహుధా విజాయతే"** (భగవంతుడు కర్మ సంబంధం వల్ల పుట్టకపోయినా కరుణవల్ల పలు విధాలుగా జన్మిస్తున్నాడు) అని వేదం, **"బహూని మే వ్యతీతాని జన్మాని"** (నా జన్మలు చాలా గడచినవి) అని వేదవేద్యుడు, **"శన్మమ్ పల పల శెయ్ దు"** (అనేక జన్మలను ఎత్తి) అని వైదికసార్వభౌములైన శఠకోపులు పలకడం గమనించదగినది.

భగవదవతారాలు ఇన్ని అని లెక్క కట్టడానికి వీలు కాదు అని దీనివల్ల తెలుస్తున్నది. అయినా, భగవానుని అవతారాలలో పది అవతారాలను మహర్షులు, ఆழ்వార్లు, పూర్వాచార్యులు మాటిమాటికి వర్ణించారు. **"మీనోడు ఆమై కేழ்ల్ అరి కుఱళాయ్. మున్నుమ్ ఇరామనాయ్ తానాయ్ పిన్నుమ్ ఇరామనాయ్ తామోదరనాయ్ కఱ్కియుమానాన్"** (మత్స్యమై, కూర్మమై, వరాహమై, నరసింహమై, వామనుడై, పరశురాముడై, శ్రీరాముడై, బలరాముడై, కృష్ణుడై, కల్కియై), **"ఏన మీనామైయోడు అరియుమ్ తానుమాయ్ కుఱళాయ్ త్తరణిత్తలైవన్"** (వరాహం,

మత్స్యం, కూర్మంతో పాటూ నరసింహమై, వామనుడై, శ్రీరాముడై) అని తిరుమంగై ఆళ్వార్లు పలికారు కదా.

దశావతారాలలో రామావతారం మూడు విధాలుగా కనిపిస్తున్నది. **"తేవుడైయ మీనమాయ్ ఆమైయుమాయ్ ఏనమాయ్ అరియాయ్ కుఱళాయ్ మూవురువిల్ ఇరామనాయ్ క్కణ్ణనాయ్ కఱ్కియాయ్"** (దివ్యత్వాన్ని కలిగిన మీనమై, కూర్మమై, వరాహమై, నరసింహమై, వామనుడై, మూడు విధాలైన రాముడై, కృష్ణుడై, కల్కియై) అని ఆళ్వార్లు పలికిన పాశురంలో **"మూవురువిల్"** అని ఈ విషయాన్ని తెలిపారు. కలియన్ మాత్రం ఆ విధంగా కాకుండా, దశరథరామావతారం ఈ మూడింటిలో ప్రధానం కనుక, దానిని **"తానాయ్", "తానుమాయ్"** అని నిర్దేశించారు. పెరియవాచ్చాన్ పిళ్ళై **"తానుమాయ్"** అనే సూక్తిని (5–4–8) **"మున్నుమిరామనాయ్ త్తానాయ్ ప్పిన్నుమిరామనాయ్ – ఎన్నక్కడవదిఱే. అల్లాద విడఙ్గళ్ శక్త్యేకదేశమ్ అవన్ తానే వన్దాన్ ఎన్నక్కడవదిఱే, ఇరామావతారత్తై"** (ముందుగా అవతరించిన పరశురాముడై, శ్రీరాముడై, తరువాత బలరాముడై అని చెప్పబడినది కదా. మిగిలిన అవతారాలలో తన శక్తిలో ఒక భాగం, ఈ శ్రీ రామావతారంలో తానే స్వయంగా వచ్చి అవతరించాడు అని చెప్పబడింది కదా) అని, **"తానాయ్"** అనే సూక్తిని (8–8–10) **"మత్స్యాది దశావతారఙ్గళైయుమ్ పణ్ణి జగద్రక్షణమ్ పణ్ణిన తన్నై"** (మత్స్యం మొదలైన పది అవతారాలను ఎత్తి లోక రక్షణ చేసిన తనను) అని వ్యాఖ్యానించారు. **"వేదానుద్ధరతే...క్షత్రక్షయం కుర్వతే, పౌలస్త్యం జయతే హలం కలయతే కారుణ్య మాతన్వతే మ్లేచ్ఛాన్ మూర్ఛయతే దశాకృతికృతే కృష్ణాయ తస్మై నమః"** (వేదాలను ఉద్ధరించేవాడు.. క్షత్రియకులాన్ని సంహరించేవాడు, రావణుని జయించేవాడు, నాగలిని ధరించేవాడు, దయను చూపించేవాడు, మ్లేచ్ఛులను మూర్ఛపోయేటట్లు చేసేవాడై పది అవతారాలను ఎత్తిన ఆ కృష్ణునకు నమస్కారం) అని జయదేవకవి గీతగోవింద కావ్యం ఆరంభంలో దశావతారాలను పలికాడు. జయదేవుడు శ్రీకృష్ణావతార ప్రాధాన్యాన్నిబట్టి. ఆళ్వార్లు రామావతార ప్రాధాన్యాన్ని అనుసరించి పై సూక్తులను పలికారు. అయితే, కల్యాణగుణాభిరాముడు కదా శ్రీరాముడు.

శ్రీకృష్ణావతార లీలలలో కొన్నిటిని గమనించినప్పుడు, అవి పండితులకుమాత్రం భోగ్యంగా ఉంటాయి తప్ప, పామరులకు భోగ్యంగా ఉండవు. పండితపామర భేదం లేకుండా అందరిని ఆకర్షించే అవతారం శ్రీరామావతారం ఒకటే. జయదేవకవి ఈ విషయాన్ని ప్రసన్న రాఘవమనే నాటకంలో **"కథం పునరమీ కవయో రామచంద్రమేవ వర్ణయంతి?"** (ఎందువల్ల ఈ కవులంతా రామచంద్రునే వర్ణిస్తున్నారు?) అని ప్రశ్నించి, **"నాయం కవీనాం దోషః, యతఃస్వసూక్తీనాం పాత్రం రఘుతిలకమేకం కలయతాం కవీనాం కో దోషః? స తు గుణగణానా మవగుణః, యదేతైః నిశ్శేషైః అపరగుణలుబ్ధైరివ జగత్ అసా వేక శ్చక్రే సతతసుఖసంసారవసతి"** (ఇది కవుల దోషం కాదు. ఎందువల్లనంటే – తమ సూక్తులకు రామచంద్రుని విషయంగా చేసుకోవడంలో కవుల దోషం ఏమున్నది? ఆ దోషం రామచంద్ర మూర్తి కళ్యాణ గుణాలదే. ఎందుకంటే అతడు ఒక్కడే ఈ సంసారాన్ని అంతటినీ తన గుణాలతో మోహింపజేస్తున్నాడు) అని ఇత్యాదిగా తెలిపాడు. ఇటువంటి శ్రీరామచంద్రమూర్తి కళ్యాణగుణాలను సంగ్రహంగా అనుభవిద్దాం.

శ్రీరామాయణం ప్రారంభంలో 'సంక్షేప రామాయణ' సర్గ ఉన్నది. అందులో మొదట వాల్మీకి–నారద సంవాదం ఉన్నది. వాల్మీకి మహర్షి నారదుని ప్రశ్నించేటప్పుడు **"కో ను అస్మిన్ సాంప్రతం లోకే"** — ఈ కాలంలో, ఈ దేశంలో ఎవడు గుణవంతుడు? – అని ప్రశ్నించాడు. వాల్మీకి రామాయణం చివరలో **"అభ్యషించత్ నరవ్యాఘ్రమ్"** (పురుషోత్తమునకు పట్టాభిషేకం చేశారు) అని ఉన్నది. ఈ ఉపక్రమ ఉపసంహారాలను జాగ్రత్తగా గమనిస్తే ఈ క్రింది విషయం తెలుస్తున్నది. అది ఏమంటే – మిగిలిన సాకేతప్రభువులకు జరిగిన పట్టాభిషేకంవంటిది కాదు, శ్రీరామ సామ్రాజ్య పట్టాభిషేకం. కల్యాణగుణ సామ్రాజ్య పట్టాభిషేకం అప్పుడు శ్రీరామునకు జరిగినది అని వీటివల్ల తెలుస్తున్నది. రాముడు భవనవాసాన్ని కాదని వనవాసాన్ని ఆదరించాడు గనుక, అతని కళ్యాణగుణాలు అన్నీ వ్యక్తమయ్యాయి. ఇది కూడా ఈ అవతారంలోని ఒక రహస్యం.

వ్యాసభగవానుడు కూడా శ్రీవిష్ణు సహస్రనామస్తోత్రంలో **"పరర్ధిః పరమస్పష్టః"** అని ఆరంభించి శ్రీరాముని కళ్యాణ గుణాలను ఎన్నిటినో పలు నామాల ద్వారా తెలియజేశారు. వీటిని పరాశర భట్టర్ శ్రీ రామాయణంలోని సూక్తులను ప్రమాణీకరిస్తూ వివరించడం విశేషం.

భగవంతుని గుణాలు అనంతమైనా, వాటిని రెండు వర్గాలుగా విభజించవచ్చు. పరత్వ వర్గానికి చెందిన గుణాలు, సౌలభ్యవర్గానికి చెందిన గుణాలు—అనేది ఈ విభాగం. మన సిద్ధాంతంలో ఆత్మలు లెక్కలేనివి. **"వణ్ పొరుళ్ ఈఱిల"** (లెక్కలేనంత మంది ఆత్మలు) అని ఆళ్వార్లు అన్నారు. అయినా, ఆత్మలను బద్ధ-ముక్త-నిత్య భేదంతో మూడు వర్గాలుగా వర్గీకరిస్తారు. లెక్కలేనంతమంది జీవులందరూ ఈ మూడు వర్గాలలో అంతర్భవిస్తారు కదా. ఆ విధంగానే భగవంతుని అనంతమైన కళ్యాణగుణాలను కూడా పరత్వ-సౌలభ్య భేదంతో విభాగం చేయవచ్చు. ఒక పిడికిలిలో నిండుగా ఉండే ఇసుకరేణువులను ఒక వెయ్యి రేణువులు, రెండు వేలు రేణువులు అని లెక్క కట్టలేకపోయినా, "ఒక పిడికెడు ఇసుక" – అని లెక్కించవచ్చు కదా. ఆ విధంగానే భగవానుని అనంతమైన కళ్యాణగుణాలను కూడా రెండు విధాలుగా విభాగం చేయవచ్చు.

ఈ దృష్టిలో శ్రీరాముని పరత్వగుణాలను, సౌలభ్యగుణాలను సంగ్రహంగా దర్శిద్దాం. **"కీళ్ మకన్ తలైమకనుక్కు సమసఖావాయ్"** (నీచమైన బోయ కులానికి ప్రభువైన గుహునకు స్నేహితుడై) అని ఆరంభించి 'ఆచార్య హృదయ' గ్రంథకర్త నాయనార్ శ్రీరాముని సౌశీల్యాన్ని వివరించారు. తిరుమంగై ఆళ్వార్లు **"ఏழை ఏదలన్ కీళ్ మకన్ ఎన్నాదు"** (జ్ఞానం లేనివాడు, అల్పమైన సుఖాలను కోరేవాడు, తక్కువ కులానికి చెందినవాడు అని భావించకుండా అతనిని తనకు స్నేహితునిగా చేసికొన్నాడు) ఇత్యాదిగా ఈ గుణాన్ని అనుభవించారు. శ్రీరామావతారతత్త్వమే సౌశీల్యం అని అన్నారు పరాశర భట్టర్ 'భగవద్గుణ దర్పణం' అనే సహస్రనామ వ్యాఖ్యానంలో. శ్రీరామాయణంలో **"కః గుణవాన్"** (ఎవరు గుణాలను కలవారు?) అనే మొదటి ప్రశ్నకు ఇది భావమని పెద్దలంటారు. **"వశీ వదాన్యో గుణవాన్"** (అందరినీ వశం

చేసుకునేవాడు, ఔదార్యాన్ని కలవాడు, సౌలభ్య గుణం కలవాడు) అని పరమాచార్యులైన శ్రీయామునులు సౌశీల్యగుణాన్ని గుణశబ్దంతో నిర్దేశించారు. ఈ గుణాన్నిపెద్దలు **"మహతో మందై స్సహ నీరంధ్రేణ సంశ్లేషః సౌశీల్యమ్**" (గొప్పవాడు చాలా తక్కువవానితో ఏ తేడా లేకుండా కలసి వర్తించడం సౌశీల్యం) అని నిర్వచించారు. గంగాతీరంలో శ్రీగుహునితో, పంపానదీ నదీతీరంలో సుగ్రీవునితో, సముద్రతీరంలో విభీషణునితో కలిసినప్పుడు శ్రీరామునిలో ఈ కళ్యాణగుణం వ్యక్తమైనది.

వ్యాధుల కులానికి రాజయిన గుహునిలో, వానరరాజైన సుగ్రీవునిలో, అసురరాజైన విభీషణునిలో ఉండే తక్కువదనాన్ని నిత్యసూరినాథుడైన తనలో ఉండే పరత్వాన్ని గమనించకుండా, వారితో శ్రీరాముడు ఏ తేడా లేకుండా కలిశాడు. విభీషణుని రావణుడు **"కులపాంసన"** (కులాన్ని చెడగొట్టినవాడు) అని నిందించాడు. శ్రీరాముడు ఆ విభీషణుని ఇక్ష్వాకువంశంలోని వానినిగా తలచాడు. ఇంతటి సౌలభ్యం వ్యక్తమయే ఈ సందర్భంలో కూడా పరుని విడిచిపెట్టి ఉండని పరత్వం అనే గుణం శ్రీరామునిలో వ్యక్తమైనది. "మధురానగరంలో శ్రీకృష్ణుడు మాలాకారుని ఇంటికి వెతికి వెళ్ళి అతనిని అనుగ్రహించినప్పుడు మాలాకారుడు **'ప్రసాదపరమౌ నాథౌ మమ గేహముపాగతౌ'** (గొప్ప దయను కలవారు, నాధులు అయినా, బలరామకృష్ణులు నా ఇంటికి వచ్చారు) అని అతనిని కీర్తించాడు. అపుడు శ్రీకృష్ణుడు అనుగ్రహమే మూర్తీభవించినట్లు తోచినా, అతనిలో పరత్వం కూడా తోచింది, ఎందుకంటే, అది దానికి ఆశ్రయమైన భగవంతుని విడిచి ఉండదు గనుక" అని అన్నారు ఆచార్యహృదయకారులు. ఆ విధంగానే శ్రీరాముడు సౌశీల్యసౌలభ్యాలను ప్రదర్శించిన ఈ తరుణంలో కూడా, అతనిని పరత్వం విడిచి ఉండదు గనుక, అది కూడా ఆ స్వామిలో వ్యక్తమయింది.

ఈ విషయాన్ని కూరేశులనే ఆచార్యులు 'అతిమానుషస్తవం' అనే కృతిలో **"పృచ్ఛామి కించన", "అబ్ధిం న తేరిథ", "మానుష్యకం చరితుమ్"** అనే శ్లోకాలలో తెలియజేశారు. మానవ కులంలో అవతరించినవాడు ఒక పక్షికి మోక్షాన్ని ఇవ్వడం, వానరాలు తెచ్చిన రాళ్లతో వారధి కట్టి

వార్ధిని దాటడం, రావణుడు బతికి ఉండగానే అతని తమ్ముడైన విభీషణునకు లంకారాజ్య పట్టాభిషేకాన్ని చేయడం – ఇవన్నీ శ్రీరామునిలోని పరత్వాన్ని సూచిస్తున్నాయి కదా.

ఇటువంటి పరత్వ సౌలభ్య గుణసామ్రాజ్యప్రాప్తిని పొందిన శ్రీరామునకు వశిష్ఠుడు మొదలైన మహర్షులు పట్టాభిషేకం చేశారు. భగవానుని ఈ పరత్వసౌలభ్య గుణాలకు మూలం అతడు శ్రీసంబంధాన్ని కలిగి ఉండడమే. "**మామాయన్ మాదవన్ గోవిన్దన్**" (గొప్ప మాయను కలవాడు, మాధవుడు, గోవిందుడు) అని గోదాదేవి, "**లోకనాథః మాధవో భక్తవత్సలః**" (లోకనాధుడు, మాధవుడు, భక్తవత్సలుడు) అని వ్యాసమహర్షి దీనిని తెలిపారు. అందువల్లనే వాల్మీకి మహర్షికూడా "**సహసీతం న్యవేశయత్**" (సీతాదేవితోపాటుగా కూర్చుండబెట్టారు) అని అన్నారు.

ଔଔଔଔଔଔଔଔଔଔ

# శ్రీమణవాళ మహామునుల “వేదాంతసారనిష్కర్షం”

*(తమిళ మూలం: ఉ.వే శ్రీమాన్ వేళుక్కుడి వరదాచార్యస్వామివారు)*

శ్రీమన్నారాయణుని నుండి ఆరంభమై, భగవద్రామానుజులను మధ్యలో కలిగి, శ్రీవరవరమునులతో పూర్తి అవుతున్న ఆచార్య పరంపర 'పూర్వాచార్య పరంపర' అని పిలువబడుతున్నది. శ్రీ బదరికాశ్రమంలో అష్టాక్షరీ మహామంత్రాన్ని నారాయణుడు తన అంశతో అవతరించిన నరునకు ఉపదేశించాడు. ఆ నారాయణుడే శ్రీవిష్ణులోకంలో తన మహిషి అయిన లక్ష్మీదేవికి ద్వయాన్ని ఉపదేశించాడు. అతడే శ్రీ కృష్ణుడుగా అవతరించి, చరమశ్లోకాన్ని అర్జునుని రథం తొట్టిలోనుండి తనను ఆశ్రయించిన అతనికి ఉపదేశించాడు. ఆ శ్రీమన్నారాయణుడే ఆసేతుహిమాచలం కొలిచే శ్రీరంగ క్షేత్రంలో, **"పొఙ్గోదమ్ శూழ்న్ద పువనియుమ్ విణ్ణులకమ్ అఙ్గాదుమ్ శోరామే ఆழ்కిన్ఱ శఙ్గోలుడైయ తిరువరంగ చ్చెల్వనార్"** (సముద్రాన్ని చుట్టూ కలిగిన ఈ భూమండలం, పరమపదం—అనే ఈ రెండు విభూతులలో ఏదీ చెదిరిపోకుండా పాలించే ఆజ్ఞాదండాన్ని కల శ్రీరంగనాథుడు) అనే గోదాదేవి సూక్తి రీతిలో నిత్యనివాసాన్ని కలవాడై, ఉభయవిభూతులను పాలిస్తూ, తన మహిషి అయిన శ్రీరంగనాయకికి ఒకేసారి ఈ మూడు రహస్యాలను ఉపదేశించగా, తచ్ఛిష్య శిష్యపరంపరగా ఈనాటికీ మనవరకు ఈ మూడు రహస్యాలు లభిస్తున్నాయి. ఈ విషయం **"పునరపి స ఏవ భగవాన్ శ్రీరంగనాథః స్వమహిషీ విష్వక్సేన శ్రీపరాంకుశ నాథయామున ప్రభృతి పూర్వాచార్యముఖేన..... శుద్ధం రహస్యత్రయ సంప్రదాయ మవతారయామాస"** (ఆ శ్రీరంగనాథుడే మళ్లీ తన పత్ని అయిన లక్ష్మీదేవి, విష్వక్సేనుడు, నమ్మాழ்వార్లు, నాథమునులు, యామునులు మొదలైన పూర్వాచార్యుల ద్వారా శుద్ధమైన రహస్యత్రయ సంప్రదాయాన్ని ఈ లోకంలో అవతరింపజేశాడు) అనే **'రహస్యత్రయ మీమాంసాభాష్య'** సూక్తి వల్ల వ్యక్తమవుతున్నది. అందువల్ల నారాయణుడే ప్రథమాచార్యుడని తెలుస్తున్నది. ఈ ఆచార్యపరంపరలో భగవద్రామానుజులు రత్నహారంలో నాయకమణివలె

మధ్యలో ఉండి, తమకు ముందు, తర్వాత గల ఆచార్యులకు అందరికీ శోభను కలిగించేవారై ప్రకాశిస్తున్నారు. ఈ సంగతి **"అమునా తపనాతిశాయిభూమ్నా యతిరాజేన నిబద్ధనాయకశ్రీః, మహతీ గురుపంక్తిహారయష్టిః విబుధానాం హృదయంగమా విభాతి"** (సూర్యుని కంటే గొప్ప ప్రకాశాన్ని కలిగిన భగవద్రామానుజులను నాయకమణిగా కలిగిన ఆచార్య పరంపరాహారం పండితుల హృదయాలను రంజింపజేస్తున్నది) అనే వేదాంతదేశికుల సూక్తివల్ల, ఆ విధంగానే, **"అర్వాంచో యత్పదసరసిజద్వంద్వ మాశ్రిత్య పూర్వే మూర్ధ్నా యస్యాన్వయముపగతా దేశికా ముక్తిమాపుః"** (శ్రీరామానుజులకు తరవాత అవతరించిన ఆచార్యులు వారి పాదాలను ఆశ్రయించినవారై, ఆ విధంగానే, వారికి ముందున్న పూర్వాచార్యులు వారి శిరస్సుతో సంబంధం కలిగినవారై — ఈవిధంగా అందరూ శ్రీరామానుజులతో తమకు గల సంబంధం చేత ముక్తిని పొందారు) అనే ఇంకొక పెద్దల సూక్తి వల్ల ఈ విషయం ప్రసిద్ధమవుతున్నది. ఈ పూర్వాచార్య పరంపరలో చరమాచార్యులు మణవాళమహామునులు. అందువల్లనే వారు పరమాచార్యులు కూడా అవుతున్నారు. వీరు విశదవాక్ శిఖామణి అయినందున వీరివద్ద శ్రీరంగనాథుడు 'ఈడు' వ్యాఖ్యానాన్ని ఒక సంవత్సరం పాటు కాలక్షేపంగా విన్నాడు. భగవద్రామానుజులు, నంబిళ్ళైవంటి వేరు ఏ ఆచార్యులకు దక్కని ఈ గొప్పతనం శ్రీమణవాళమహామునులకు లభించింది. ఇదే లక్ష్మీనాథ నిరూపితాచార్యత్వం. శ్రీరంగనాథుని పరిపూర్ణమైన కృపను పొందిన ఆచార్యులు వీరు ఒక్కరే అనేది 'సత్యం సత్యం పునః సత్యం'. ఈ విధంగా ప్రథమాచార్యుడే చరమాచార్యునకు శిష్యుడయ్యాడు. అందువల్ల మన పూర్వాచార్య పరంపర ఒక హారంగా ప్రకాశిస్తున్నది. ఈ ఆచార్యచక్రాన్ని ఆశ్రయించేవారు అనాదిగా ఉండే సంసారచక్రంనుండి బయటపడగలరు అని చిరకాలం పెద్దలను సేవించిన జ్ఞానవృద్ధులు (చిరోపాసితసద్వృద్ధులు) అంటారు. పెరియజీయర్, విశదవాక్ శిఖామణి, శ్రీరంగనాథునకు కూడా ఆచార్యులు అయిన మణవాళ మహామునులు దర్శించిన సత్సంప్రదాయ నిష్కర్షాన్ని **'వేదాంతసార నిష్కర్షం'** అనే శీర్షికపై గమనిద్దాం.

**"మానాధీనా మేయసిద్ధిః"** అని పెద్దలంటారు. మన దర్శనానికి ప్రమాణాలు మూడు. ప్రత్యక్షం, అనుమానం, శబ్దం అనేవి ఆ మూడు. శబ్దప్రమాణం — శ్రుతి, స్మృతి, మీమాంస అని

మూడు విధాలు. ఈ వేదం కూడా వేదం, వేదాంతం, వేదాంత సారం అని మూడు విధాలుగా ఉంటుంది. వేదంలోని పూర్వ భాగం వేదమని, ఉత్తర భాగం వేదాంతమని, రహస్య త్రయం వేదాంత సారం అని చెప్పబడుతున్నది. ఆ వేదాంతసారంలోని నిష్కర్షాన్ని ఇదమిత్థంగా తెలిసికొందాం.

వేదాన్ని ఈ విధంగా మూడు విధాలుగా విభాగం చేసే ప్రమాణం ఉన్నదా? – అనే విషయాన్ని ముందు గమనిద్దాం. ఈ విషయంలో **"అసారం అల్పసారం చ సారం సారతరం త్యజేత్, భజేత్ సారతమం శాస్త్రం రత్నాకర ఇవామృతమ్"** (సారం లేనిది, అల్పమైన సారాన్ని కలిగినది, సారమైనది, సారతరమైనది అయిన శాస్త్రాన్ని విడిచిపెట్టి, సముద్రంలో మిక్కిలి సారమైన అమృతాన్ని ఆదరించినట్లు ఉత్తమమైన శాస్త్రాన్ని ఆదరించాలి) అనే వైకుంఠ దీక్షితులు వచనం ప్రమాణం. ఈ వచనంలో రత్నాకరం దృష్టాంతంగాను, శాస్త్రం దార్ష్టాంతికంగాను చెప్పబడిందనే విషయాన్ని గమనించాలి. సముద్రంలోపల ఉండే 'అసారం' మొదలైన నాలుగు విడువదగినవి. ఐదవది అయిన 'సారతమం' గ్రహించదగినది. ఈ విధంగానే శాస్త్రంలోని అసారాది చతుష్టయం విడువదగినది, అయిదవది అయిన సారతమం గ్రహించదగినది అని తెలుస్తున్నది.

ఈ శ్లోకాన్ని దేశికులు **'శ్రీ రహస్యత్రయ సారం'** అనే గ్రంథంలో సారనిష్కర్షాధికారం అనే భాగంలో ఉదాహరించి వివరించారు. దేశికుల **"శ్రుతిపథవిపరీతమ్"** అనే శ్లోకాన్ని, **"బాహ్యకుదృష్టిశాస్త్రజ్ఞళ్"** అనే వారి వివరణ వాక్యాన్ని ఇక్కడ గమనించాలి. దేశికుల వ్యాఖ్యానాన్ని అనుసరించి బాహ్య కుదృష్టి శాస్త్రాలు అసారమని, వేదంలోని పూర్వభాగంలో చెప్పబడిన ఐహిక ఫలాలను, వాటిని కలిగించే సాధనాలను తెలిపే భాగం అల్పసారమని; ఆముష్మికఫలాలను, వాటి సాధనాలను తెలిపే భాగం సారమని; ఆత్మప్రాప్తిని, దానికి సాధనాలను తెలిపే భాగం సారతరమని; పరమాత్మ ప్రాప్తిని, దానికి సాధనాలను తెలిపే భాగానికి సారతమమని; ఈ సారతమాన్నే వివేకం కలవారు ఆదరించాలనేది ఈ శ్లోకార్థమని తెలుస్తున్నది. శ్లోకంలో ఉండే శాస్త్రపదం వేదం, దానిని అనుసరించేవి, విరుద్ధమైనవి అయిన శాస్త్రాలను తెలుపుతుంది—అని

చెప్పాలి. అంతే తప్ప, కేవలం వేదాన్ని మాత్రమే తెలుపుతుంది అంటే, అసారపదానికి అర్థంగా చెప్పే బాహ్యాదిశాస్త్రాలు వేదఘటకాలు కానందున ప్రమాణశ్లోకంలోని 'శాస్త్రే' అని పదంలో గల నిర్ధారణసప్తమికి బాధ కలుగుతుంది. **'శ్రుతిపథవిపరీతమ్'** అనే శ్లోకంతో ఐకరస్యంకూడా ఏర్పడదు – అనే పెద్దల వివరణం వల్ల కూడా ఈ విషయం తెలుస్తున్నది.

అయినా, గమనించి చూస్తే, అసారమనే పదానికి బాహ్యకుదృష్టి శాస్త్రపరత్వం పల్కడం తగదని తెలుస్తుంది. "అసారమైన శాస్త్రాన్ని విడిచిపెట్టు" అనికదా ఇక్కడ అర్థాన్ని చెప్పాలి. బాహ్యకుదృష్టిశాస్త్రాలకు శాస్త్రత్వమే లేదు కదా! అలౌకిక ఫలాలను, వాటి సాధనాలను ప్రతిపాదించేదికదా శాస్త్రం. **"శాసనాత్ శాస్త్రమ్"** అని కదా చెప్పబడుతున్నది. బాహ్యకుదృష్టి శాస్త్రాలకు సాక్షాత్తుగా కానీ, లేక, శీక్షాది శాస్త్రాలకువలె పరంపరగాగాని పురుషార్థంతో సంబంధం లేదు కదా. **"యా వేదబాహ్యా స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః, సర్వాస్తా నిష్ఫలా ప్రేత్య తమోనిష్ఠా హి తాః స్మృతాః**"(వేదానికి విరుద్ధమైన స్మృతులు, వేద విరుద్ధమైన వాదాలు అన్ని ఉపయోగం లేనివి. అవి తమోగుణాత్మకాలుగా చెప్పబడుతున్నాయి) అని మనువు అన్నాడు కదా. ఇంతేకాక, **"వేదాత్ శాస్త్రం పరం నాస్తి"** (వేదం కంటే గొప్ప శాస్త్రం ఏదీ లేదు) అని బాహ్య కుదృష్టి శాస్త్రాలకు శాస్త్రత్వం నిషేధింపబడింది. ఈ ప్రమాణంలో పరశబ్దం ఉత్కృష్టం అనే అర్థాన్ని తెలుపదు. ఒకవేళ ఆవిధంగా తెలియజేస్తే, సమాభ్యనుజ్ఞ (సమానమైన నిర్దేశం) చేయబడినట్లు అవుతుంది. అందువల్ల పరశబ్దం అన్యవాచి (వేరే విషయాన్ని తెలిపే పదం) అవుతుంది. అందువల్ల వేదభిన్నానికి వేదత్వం నిషేధింపబడతున్నది. ఇంతేకాక, త్యాజ్యోపాదేయవిభాగం ఒకే అవయవిలో చేయబడుతున్నది అనేది దృష్టాంతసిద్ధం. సముద్రమనే ఒకే అవయవిలోకదా అసారాది పంచకం చెప్పబడింది. ఆ విధంగానే వేదశాస్త్రమనే ఒకే అవయవిలో అసారాదిపంచకం నిరూపింపబడడం యుక్తం. అందుచేత అసారశబ్దం బాహ్యకుదృష్టిపరం కాదనేది సిద్ధం.

ఇక, ఈ ప్రమాణశ్లోకంలోని యథార్థమైన అర్థం ఏమో గమనిద్దాం. వేదంలో ఐహిక, ఆముష్మిక ఐశ్వర్యాలను, వాటికి సాధనాలను తెలిపే భాగం అసారం. ఆత్మప్రాప్తిని, దానికి సాధనాలను తెలిపే భాగం అల్పసారం. పరమాత్మప్రాప్తిని, దానికి సాధనమైన భక్తిని తెలిపే భాగం

సారం. భగవదనుభవపరీవాహ– స్వార్థకైంకర్యాన్ని, దానికి సాధనభూతమైన ఆత్మసమర్పణను తెలిపే భాగం సారతరం. ఇక, పరార్థకైంకర్యం, దానికి సాధనభూతమైన సిద్ధోపాయాన్ని ప్రతిపాదించే భాగం సారతమం—అనేది వాస్తవార్థం. ఈ విధంగా అర్థాన్ని గ్రహిస్తే పదాల స్వారస్యం చక్కగా సిద్ధిస్తుంది. అందువల్ల సారతమశాస్త్రార్థమైన రహస్యత్రయమే వేదాంత సారం అని తెలుస్తున్నది. ఇక మణవాళమహామునులు గమనించిన వేదాంతసారనిష్కర్షాన్ని గమనిద్దాం.

వైదికులైన పెద్దలు వేదాంతార్థాలను నిర్వహించే విధానాలు చాలా విలక్షణంగా ఉంటాయి. ఏవిధంగా? అంటే ‘వేదం జ్యోతిష్టోమాదికార్యాలనే ప్రధానంగా ప్రతిపాదిస్తున్నది. వేదాంతప్రతిపాదితమైన బ్రహ్మం జీవభిన్నమైన తత్త్వం కాదు. యాగాది కర్మలను చేసే జీవాత్మనే వేదాంతాలు ఆవిధంగా ప్రశంసిస్తున్నాయి. అందువల్ల వేదం కర్మపరం, కర్మలను చేసే జీవుని ప్రశంసిస్తున్నది’ అని వేదాంతాన్ని కొందరు వివరించారు.

‘వేదాంతం భక్తిప్రపత్తిరూపాలైన పలు మోక్షోపాయాలను ప్రతిపాదిస్తున్నది. **"నానాశబ్దాదిభేదాత్"**, (పలు పేర్లతో అనేక మోక్షోపాయలను వేదం విధిస్తుంది), "**అవిశిష్టఫలత్వాత్"** (ఫలంలో తేడా లేదు) అని కదా సూత్రకారవచనం. రహస్యత్రయం కూడా వేదాంతంలో అంతర్భవించినదే. వేరే శాస్త్రం కాదు. పూర్వభాగంలో చెప్పబడిన కర్మ ఫలవత్కైంకర్యరూపం. అదికూడా స్వార్థం (మన ఆనందానికి చేసేది). భక్తిప్రపత్తులు అనేవి భగవత్ ప్రాప్త్యుపాయాలు. అంటే — అవి భగవానునకు ప్రసాదాన్ని కలిగిస్తాయి. మన భక్తిప్రపత్తులవల్ల భగవానునకు కరుణ కలుగుతున్నది. కనుక భగవత్ ప్రసాదం సహేతుకం’ – అని వేదార్థాన్ని మరి కొందరు వివరించారు.

భగవానుడు సిద్ధోపాయం; అతడు వేరొక ఉపాయంయొక్క సహాయాన్ని కోరడు. జీవుడు చేసే భక్తిప్రపపత్తులు **"తం హ దేవమాత్మబుద్ధిప్రకాశమ్"** (ఆత్మకు సంబంధించిన జ్ఞానంలో స్పష్టతను కలిగించే దేవుని) అనే విధంగా భగవత్ప్రసాదంవల్ల కలుగుతాయి. అవి ఫలభూతాలు. ఉపాయాలు కావు. **"అత్మబుద్ధేః ప్రకాశః యస్మాత్ సః ఆత్మబుద్ధిప్రకాశః, తద్విషయబుద్ధిస్ఫురణస్య**

**తదనుగ్రహార్థత్వాత్"** (ఆత్మకు సంబంధించిన జ్ఞానప్రకాశం ఎవనివల్ల కలుగుతున్నదో అతడు ఆత్మబుద్ధి ప్రకాశమనబడుతున్నాడు. ఎందుకంటే, ఆ భగవంతుని వలననే ఆత్మజ్ఞానప్రకాశం కలుగుతున్నది కనుక) అని శ్రీరంగరామానుజముని ఈ శ్రుతిని వాఖ్యానించారు. **"ఎన్ ఉణర్విసుళ్ళే ఇరుత్తినేన్ అదువుమ్ అవనదు ఇన్నరుళే"** (భగవంతుని నా మనసులో నిలుపుకున్నాను. అది కూడా భగవంతుని కరుణ వల్లనే), **"ఎనదావి యార్? యాన్ ఆర్? తన్ద నీ కొణ్డాక్కినైయే"** (నా ఆత్మ ఎవరు? నేనెవరిని? రెండు నీవే కదా! వాటిని ఇచ్చిన నీవే వాటిని గ్రహించావు) అని నమ్మాళ్వార్ల సూక్తి. **"అథవా కిం ను సమర్పయామి తే"** (లేకపోతే నీకేమి సమర్పించగలను? అన్ని నీ సొత్తే కదా) అనే శ్రీయామునుల సూక్తి, **"వరద! తవ ఖలు ప్రసాదాదృతే శరణమితి వాగపి నోదియాత్"** (వరదరాజ స్వామీ! నీ అనుగ్రహం లేకపోతే నేను నిన్ను శరణు కూడా వేడలేను) అనే కూరేశుల సూక్తి అనుసంధేయాలు. అందువల్ల భక్తిప్రపత్తులు భగవానుని అనుగ్రహంవల్ల కలుగుతాయని తెలుస్తున్నది. వేదంలోని పూర్వభాగంలో చెప్పబడిన కర్మలు భగవానుని కైంకర్యరూపాలు. అవి కూడా పరార్థ కైంకర్యాలు. భగవానుని ముఖవికాసం కోసం చేయబడేవి. ఉత్తరభాగంలో చెప్పబడిన భక్తి అనేది ప్రాప్యరుచిలో (భగవంతుని పొందాలనే ఆశలో) అంతర్భవిస్తుంది. స్వరూపం ఆత్మయాథాత్మ్యజ్ఞానాన్ని ప్రకాశింపచేస్తుంది. కృపతో కూడిన భగవంతుడే ఉపాయం. అతని ప్రసాదం నిర్హేతుకం. ఫలానికి కావలసినది ఆత్మజ్ఞానం, అప్రతిషేధమే (భగవంతుడు చేసే రకణ ప్రయత్నాన్ని అడ్డుపెట్టకపోవడం) – అని వేదార్థాన్ని వివరిస్తారు, పరమ వైదికులైన మన పూర్వాచార్యులు.

ఈ అర్థనిష్కర్షం 'వేదాంతసారలబ్దం' అనే విషయాన్ని వివరిస్తాను. వేదంలోని పూర్వభాగంలో ప్రతిపాదించబడిన కర్మల వాస్తవరూపం 'భగవానుని సేవలో అవి అంతర్భవిస్తాయి' అనేదే. వేదాంతాలలో ప్రతిపాదింపబడే బ్రహ్మయొక్క స్వరూపం ఏమంటే — వేరొక ఏ ఉపాయసహాయాన్ని ఆశించని ఉపాయమై ఉండడమే. వేదాంతాలలో తెలుపబడిన భక్తియొక్క వాస్తవరూపం – పారతంత్ర్యాన్ని విషయంగా కల జ్ఞానమై ఉండడమే. ఇవి కూడా (ఈ

అధికారికి ప్రాప్యమైన భగవత్కైంకర్యం యొక్క పరార్థత్వం మొదలైనవి కూడా) వేదాంతసారంవల్ల తెలియదగినవి. అంటే, అవి రహస్యత్రయం ద్వారా తెలియదగినవి.

ఈ అర్థాన్ని కొన్ని ఉదాహరణలను చూపడంద్వారా వివరిస్తాను. 'ఘటపటాదిభేధం ప్రత్యక్షసిద్ధం కనుక, **'అప్రాప్తే హి శాస్త్రమర్థవత్'** (అంత వరకూ తెలియని విషయాన్నే శాస్త్రం తెలుపుతుంది) అనే న్యాయంవల్ల భేదం వేదాంతవేద్యం కాదు. జీవపర అభేదమే వేదాంతం' – అని అద్వైతమతం. ఈ వాదానికి తగిన సమాధానాన్ని **నడాదూర్ అమ్మాళ్** అనే పూర్వాచార్యులు **'తత్త్వ సారం'** అనే గ్రంథంలో **"ప్రత్యక్షాదితరస్తు శాస్త్రవిషయే భేద స్త్వద్వైతవత్"** అని అన్నారు. అంటే — ప్రత్యక్షాదిసిద్ధమైన భేదం స్వతంత్రభేదం. లోకంలోని వస్తువులు భగవానునకు శేషమైనవి—అని కాక, స్వతంత్రమైనవి అనే భావమే లోకంలో కలుగుతుంది. ఇది ప్రత్యక్షసిద్ధం. ఇక, శాస్త్రంద్వారా మాత్రమే తెలియదగిన అర్థం ఏమంటే — ఇవి అన్నీ భగవద్విభూతులు; భగవానునకు పరతంత్రాలు; భగవానునకు సొత్తు అనేదే. అందువల్ల శాస్త్రం ద్వారానే వీటి పారతంత్ర్యమనే స్వరూపయాథాత్మ్యాన్ని తెలిసికొనేటట్లు, ఘటపటాదిశబ్దాలు వ్యుత్పత్తి, నిఘంటువులు మొదలైనవాని ద్వారా కుండ మొదలైనవానికి వాచకాలు అని మాత్రమే తోస్తుంది. అయినా, 'అన్ని పదాలు భగవంతునివరకు బోధించి తీరుతాయి' అనే అర్థాన్ని **"వచసాం వాచ్యముత్తమమ్"** (అన్ని పదాలకు భగవంతుడు ఉత్తమమైన అర్థం) ఇత్యాది ప్రమాణాల వల్లనే తెలియాలి. అదేవిధంగా, భక్తిప్రపత్తులు మోక్షోపాయాలు ఇత్యాది అర్థాలు వేదాంతాల ద్వారా తెలిసికొన్నా, భక్తిప్రపత్తుల యథార్థమైన స్వరూపాన్ని వేదాంతసారమైన రహస్యత్రయం ద్వారానే తెలిసికోవాలి — అని.

కర్మప్రాధాన్యవాదులు వేదపూర్వభాగనిష్ఠులు. వారు 'భక్తిప్రపత్తులు ఉపాయాలు, స్వార్థకైంకర్యం పురుషార్థం' — అని పలికి వేదాంతవిదులను ఖండించారు. ఆ వేదాంతులను కూడా 'భక్తి ప్రపత్తులు అధికారి విశేషణాలు. భగవత్ కృపవల్ల కలుగుతాయి. పరార్థకైంకర్యమే పురుషార్థం' అని వేదాంతసారనిష్ఠులు ఖండిస్తారు. అందువల్ల, వేదాంతాల కంటే భిన్నమై, ఉన్నతమై ఉండే వేదాంతసారమైనది రహస్యత్రయం. 'పరార్థకైంకర్యమే ఫలం. భక్తి ప్రపత్తులు

భగవదనుగ్రహం వల్ల కలుగుతాయి' అని ఈ రహస్యత్రయం చేసే అర్థనిష్కర్షమే వేదాంతసార నిష్కర్షం. ఈ అర్థమే పంచమ సారతమం. ఇది, దీనిని తెలిపే వేదాంతసారమే ఉపాదేయం – అని తెలుస్తున్నది.

యథార్థమైన తత్వం ఈ విధంగా ఉండగా, దేశికులు **"శ్రుతిపథవిపరీతమ్"** అని వేరే విధంగా పలకడంలో ఏమి తాత్పర్యం?" అని అంటే, **"వీతరాగవ్యతిరిక్తానాం కర్మణి అశ్రద్ధానివారణార్థం, అన్వారుహ్యావాద"**మనేటట్లు, కొందరు అధికారులకు కైంకర్యాలలో అశ్రద్ధను పోగొట్టడంకోసం జైమిని బ్రహ్మశాస్త్రాన్ని కర్మశాస్త్రశేషంగా వర్ణించడం ఏవిధంగా అన్వారుహ్యావాదమో( పూర్వపక్షవాదాన్ని తాత్కాలికంగా అంగీకరిస్తూ చేసేవాదం), ఆవిధంగానే ఆత్మయాథాత్మ్యజ్ఞానం లేనివారికి సాధ్యోపాయశాస్త్రంలో అశ్రద్ధను తీర్చడంకోసం, సిద్ధోపాయశాస్త్రం (రహస్యత్రయం) అతిరిక్తమైనా, అది సాధనభక్తిప్రపత్తి శాస్త్రరూపవేదాంతాలలో అంతర్భూతమని అన్వారుహ్యావాదంగా దేశికులు పలికారు అని గ్రహించాలి. ఇక్కడ **"విషయః సారభాగోయం వేదార్థాత్ పర ఇష్యతే, పరత్వం సారశాస్త్రస్య అసారమితి మానద"** ఇత్యాది వచనాలు అనుసంధేయాలు. దీనివల్ల తేలిన అర్థం ఏమంటే – వేదాన్ని వేదాంతానుగుణంగా అన్వయించినట్లుగా, వేదాంతాన్ని వేదాంత సారానుగుణంగా నయనం చెయ్యాలి–అని. అందువల్ల శారీరకానుగుణం రహస్య త్రయనయనం–అని అనడం ఉచితం కాదు. రహస్య త్రయానునుగుణం శారీరక భాష్యాదినయనం అని అనడం ఉచితం– అని తెలిపినట్లు అయినది. ఎందుకంటే – రహస్య త్రయప్రస్థానం సారతమం కనుక.

శ్రుతిస్మృతీతిహాస పురాణపాంచరాత్రరూప సకలశాస్త్రార్థనిర్ణయం శారీరకం అని చెప్పడానికి వీలు లేదు. శ్రుత్యర్థనిర్ణాయకం శారీరకం అని కూడా చెప్పలేము. శ్రుత్యర్థనిర్ణాయకం శారీరకం అయినా, స్మృత్యర్థనిర్ణాయకం శారీరకం అని చెప్పలేము. వేదవ్యాసులు శారీరకంలో శ్రుత్యర్థాలలో ఒక అర్థాన్ని న్యాయంగా సంచారం చేసి నిశ్చయించి, దానికి సంవాదప్రమాణంగా **"స్మృతేశ్చ"**, **"స్మరంతి చ"** అని స్మృత్యాదులను ఉదాహరించారు. **"సౌత్రీ తర్కప్రతిష్ఠా"** అని దేశికుల వచనం, **"ద్వయం ఖలు తర్కజాతమ్, శ్రుతివిరుద్ధం, అవిరుద్ధం చేతి. తేన**

**తర్కాప్రతిష్ఠావచనమ్. 'ఆర్షం ధర్మోపదేశం చ', ఇత్యాదిప్రకారేణ వేదావిరుద్ధతర్కవిషయతయా యోజ్యమ్, న పునః వేద ఇతికర్తవ్యతారూపతర్కవిషయమ్"** (తర్కసమూహం శ్రుతి విరుద్ధం, శ్రుతికి విరుద్ధం కానిది అని రెండు విధాలైనది. అందువల్లనే బ్రహ్మసూత్రాలలో 'తర్కాప్రతిష్ఠానాత్' — అని చెప్పబడింది. తర్కాలను అన్నిటినీ వేదాలకు విరుద్ధం కాని విధంగా అన్వయించుకోవాలి. వేద విరుద్ధాలైన తర్కాలు ప్రమాణం కాదు) అనే కుమారవరదాచార్య సూక్తి అనుసంధే యం. అధీతశాఖార్థ– నిర్ణాయకం (అధ్యయనం చేయబడిన శాఖలలోని అర్థాలను నిర్ణయించేది) న్యాయం. అనధీతశాఖార్థనిర్ణాయకాలు (అధ్యయనం చేయబడని శాఖలలోని అర్థాలను నిర్ణయించేవి) స్మృత్యాదులు అని కదా నిష్కర్షం. శ్రుతిలోకూడా సార్వత్రికంగా న్యాయసంచారం లేదు. అస్పష్టస్థలంలోకదా న్యాయసంచారం చేయబడుతుంది. "న్యాయనిరపేక్షంగా సిద్ధం" అనే దేశికుల రహస్యత్రయసారపరికరాధికారవాక్యాన్ని గమనించాలి. శ్రుతులలోవలె స్మృతులలోకూడా న్యాయసంచారాన్ని గ్రహిస్తే ఉపబృంహణాలు, ఉపబృంహ్యాలు—అనే తేడా లేకుండాపోతుంది. న్యాయాలను కొంచెం తెలిసిన మైత్రేయుడు పురాణశ్రవణాన్ని చేయడంకోసం శ్రీపరాశరభగవానుని దగ్గరకు వెళ్ళాడు – అనికదా శ్రీవిష్ణుపురాణవచనం. **"భాష్యకారర్ ఇదుకొణ్డు సూత్రవాక్యఙ్గళై ఒరుఙ్గవిడువర్"** (శ్రీరామానుజులు తిరువాయ్ మొళిలోని పాశురాలను ఆధారంగా చేసుకొని బ్రహ్మసూత్రాలను వివరించారు) అని నాయనార్ వచనం. **"శెయ్య తమిழ் మాలైకళ్ నామ్ తెళియ ఓది త్తెళియాద మఱైనిలఙ్గళై తెళికిన్ఱోమే" (అందమైన ద్రావిడ పాశురాలను మేము స్పష్టంగా అభ్యసించి, అంత వరకు తెలియని శాస్త్రార్థాలను తెలిసి కొన్నాము)** అని దేశికవచనాన్ని గమనించాలి. దివ్యసూరిసూక్తుల సహాయంతోకదా శారీరకార్థనిర్ణయం చేయాలి – అని కదా చెప్పబడింది. అంతే తప్ప శారీరకంతో దివ్యసూరిసూక్త్యర్థనిర్ణయం చేయాలని అనలేదు. అందువల్ల ఉపబృంహణాలకు శారీరకన్యాయాపేక్ష పొసగదు. అందువల్ల వేదాంతసారభూత రహస్యత్రయార్థానుగుణం శారీరకాదినయనం కార్యమని చెప్పినట్లయినది.

ఈ విధంగా – 'వేదాంతశారీరకాది ప్రతిపాద్య భక్తిప్రపత్తులు ఫలం. బ్రహ్మం ఒకటే ఉపాయం. వేదంలో పూర్వభాగంలో ప్రతిపాదింపబడిన కర్మ పరార్థకైంకర్యరూపం' అనేది వేదాంతసారనిష్కర్షం.

※※※※※※※※※※※※※※

# గాయత్రీమంత్రార్థవిచారం

*(తమిళ మూలం: ఉ.వే శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యఙ్గార్ స్వామివారు)*

బ్రాహ్మణులు ప్రతిదినం అనుసంధించే గాయత్రీ మంత్రంలో చెప్పబడేవాడు పరమపురుషుడైన శ్రీమన్నారాయణుడే – అనే విషయం సప్రమాణంగా నిరూపింపబడుతున్నది.

**(సవితుః దేవస్య వరేణ్యం తత్ భర్గః ధీమహి)** దేవుడైన సూర్యునిలో ఉండేది, అందరిచే కోరబడేది అయిన ఆ తేజస్సును ధ్యానిస్తున్నాము.

**(దేవస్య)** ప్రకాశిస్తూ ఉండేవాడు – అని అర్థం; స్తోత్రం చేయడానికి తగినవాడు అనే అర్థం కూడా చెప్పవచ్చు. వేయి కిరణాలను కలిగినవాడైన – అనే అర్థం కూడా చెప్పవచ్చు.

**(సవితుః)** సూర్యుని మండలంలో ఉండే – అని అర్థం.

**(వరేణ్యం తత్ భర్గః)** ఉపాసించదగిన ఆ తేజస్సును – అని అర్థం.

**(తత్)** పలు శ్రుతులచే పఠింపబడే ప్రసిద్ధిని ఈ సర్వనామ పదం తెలుపుతున్నది.

**"య ఏషోంతరాదిత్యే హిరణ్మయ పురుషో దృశ్యతే, హిరణ్యశ్మశ్రుః హిరణ్యకేశః ఆప్రణఖాత్ సర్వ ఏవ సువర్ణః, తస్య యథా కప్యాసం పుండరీకమేవమక్షిణీ"**

(సూర్యునకు మధ్యలో సువర్ణమయుడై, బంగారు రంగులో మీసాలను కలవాడై, బంగారువంటి కేశపాశాన్ని కలవాడై, గోళ్ళనుండి అంతా బంగారుమయంగా ఉండేవాడైన ఏ పురుషుడు దర్శింపబడుతున్నాడో అతడు సూర్యునిచే వికసింపజేయబడిన తామరల వంటి రెండు కన్నులను కలవాడు) అని ఛాందోగ్యోపనిషత్తులో పఠింపబడే పుండరీకాక్షుడనే తేజస్సే ఇక్కడ చెప్పబడుతున్నది – అని తెలుస్తున్నది. ఈ విధంగా ఆదిత్య మండలంలో మధ్యన వేంచేసి

ఉండేవాడు పరమపురుషుడైన శ్రీమన్నారాయణుడే అనే విషయాన్ని వివరించే పలు స్మృతివచనాలను మనం గమనించవచ్చు.

**ఈశ్వరం పురుషాఖ్యం తు సత్యధర్మాణ మచ్యుతమ్,**
**భర్గాఖ్యం విష్ణుసంజ్ఞం తు ధ్యాత్వామృత ముపాశ్నుతే,**
**హృద్వ్యోమ్ని తపతి హ్యేషః బాహ్యే సూర్యస్య చాంతరే,**
**అగ్నా వధూమకేప్యేష జ్యోతి శ్చిత్రతరో హ్యయమ్,**
**సవితు స్తత్ వరేణ్యం తు సత్యధర్మాణమీశ్వరమ్,**
**హిరణ్యవర్ణం పురుషం వ్యోమ తత్ విష్ణుసంజ్ఞితమ్,**
**సూర్యమధ్యే స్థితః సోమః తస్య మధ్యే హుతాశనః,**
**తేజోమధ్యే స్థితం సత్వం సత్వమధ్యే స్థితోచ్యుతః"**

(ఈశ్వరుడై, 'పురుషుడు' అనే పేరును కలవాడై శరణాగత రక్షణమనే సత్యమైన ధర్మాన్ని కలవాడై, భక్తులను విడువని అచ్యుతుడై, భర్గం అనే పేరుతో పిలువబడేవాడై, విష్ణువనే నామాన్ని కలవాడైన పురుషుని ధ్యానం చేసి మోక్షాన్ని పొందుతాను. జీవుని లోపల ఉండే హృదయాకాశంలోను, బయట ఉండే సూర్య మండలం మధ్యలో, పొగలేని అగ్నిలో ఈ తేజస్సు చాలా విచిత్రంగా ప్రకాశిస్తున్నది. అదే సూర్యుని లోపల ఉండే ఆశపడదగిన వస్తువు. అదే సత్యమైన ధర్మాన్ని కల నియంత. అదే హిరణ్యవర్ణుడు అయిన పురుషుడు. విష్ణువు అనే పేరును కలిగిన అదే ఆకాశం. సూర్యుని మధ్యలో సోముడు ఉన్నాడు. అతని మధ్యలో అగ్ని ఉన్నది. అగ్నికి మధ్యలో శుద్ధసత్వం ఉన్నది. దాని మధ్యలో అచ్యుతుడు ఉన్నాడు) – అని యోగయాజ్ఞవల్క్య మునిచే చెప్పబడింది .

**"రవిమధ్యే స్థితః సోమః తస్య మధ్యే హుతాశనః,**
**తేజోమధ్యే స్థితం సత్వం సత్వమధ్యే స్థితోచ్యుతః,**

**ఏష వై పురుషో విష్ణుః వ్యక్తావ్యక్తః సనాతనః"**

(సూర్యుని మధ్యలో సోముడు ఉన్నాడు. అతనికి నడుమ అగ్ని ఉన్నాడు. అగ్ని మధ్యలో శుద్ధ సత్వమయమైన తిరుమేని ఉన్నది. ఆ తిరుమేని మధ్యలో అచ్యుతుడు ఉన్నాడు. అతడే స్థూలసూక్ష్మరూపమైన ప్రపంచంగా, సనాతనుడుగా పురుషుడు అనే పేరును కలిగినవాడుగా ఉండే విష్ణువు) అని యమస్మృతిలో, శంఖస్మృతిలో తెలుపబడింది.

**"యోసౌ విష్ణ్వాఖ్య ఆదిత్యే పురుషోంతర హృది స్థితః,**
**సోహం నారాయణో దేవః పురుషో లోకపావనః"**

(హృదయం మధ్యలో ఉండేవాడై, సూర్యునకు మధ్యలో ఉండేవాడై, విష్ణువు అనే పేరును కలవాడైన ఏ పరమ పురుషుడు ఉన్నాడో, అతడు దేవుడనైన, పురుషుడనైన, లోకాలను సృష్టించేవాడనైన, నారాయణుడనైన నేనే) అని దత్తాత్రేయస్మృతిలో కూడా చెప్పబడింది.

**"విద్యాసహాయవంతం మామాదిత్యస్థం సనాతనమ్,**
**కపిలం ప్రాహు రాచార్యాః సాంఖ్యాః నిశ్చితనిశ్చయాః"**

(దృఢమైన అధ్యవసాయాన్ని కలిగిన సాంఖ్యాచార్యులు సనాతనుడను అయిన నన్ను సూర్యమండలం మధ్యలో విద్యాదేవితో కూడిన కపిలునిగా పలుకుతున్నారు) అని మహాభారతం మోక్ష ధర్మంలో కూడా చెప్పబడింది.

ఆగ్నేయ, నరసింహ పురాణాలలో:

**ధ్యేయ స్సదా సవితృమండల మధ్యవర్తీ**
**నారాయణః సరసిజాసన సన్నివిష్టః,**
**కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ**
**హారీ హిరణ్మయవపుః ధృతశంఖచక్రః"**

(సూర్యమండలం మధ్యలో ఉండేవాడై, కమలాసనంలో కూర్చుని ఉన్నవాడై, వలయాలను, మకర కుండలాలను, కిరీటాన్ని, హారం మొదలైన ఆభరణాలను కలవాడై, స్వర్ణమయమైన

రూపాన్ని కలవాడై, శంఖచక్రాలను ధరించి ఉండేవాడైన నారాయణుడు ఎల్లప్పుడు ధ్యానించదగినవాడు) అనే వచనం పండిత పామరులకు అందరికీ ప్రసిద్ధం కదా.

**"సైషా శక్తిః పరా విష్ణో ఋగ్యజు స్సామసంజ్ఞితా,**
**సైషా త్రయీ తపత్యంహో జగతశ్చ హినస్తి యా,**
**ఏష విష్ణుః స్థితః స్థిత్యాం జగతః పాలనోద్యతః,**
**ఋగ్యజుస్సామభూతోంత స్సవితుః ద్విజ తిష్ఠతి,**
**మాసి మాసి రవిర్యో యః తత్త తత్ర హి సా పరా,**
**త్రయీమయీ విష్ణుశక్తి రవస్థానం కరోతి వై,**
**విష్ణుశక్తి రవస్థానం సదాదిత్యే కరోతి వై,**
**ఏవం సా సాత్వికీ శక్తిః వైష్ణవ్యేషా త్రయీమయీ,**
**ఆత్మసప్తగణస్థం తం భాస్వంతమధితిష్ఠతి,**
**తయా చాధిష్ఠితం సోయం జాజ్వలీతి స్వరశ్మిభిః,**
**తమ స్సమస్తం జగతాం నాశం నయతి చాఖిలమ్,**
**ఏవం సా వైష్ణవీ శక్తిః నైవాపైతి తతో ద్విజ,**
**మాసానుమాసం భాస్వంత మధ్యాస్తే తత్ర సంస్థితా"**

(ఋక్కు, యజుస్సు, సామం అనే ఈ మూడు వేదాలు విష్ణువుయొక్క గొప్ప శక్తి. ఇది సదా ప్రకాశిస్తూ పాపాలను పోగొడుతున్నది. ఈ లోకం రక్షణలోనే స్థిరంగా ఉన్నవాడు, అందుకోసం ప్రయత్నం చేసేవాడు, ఋక్కు, యజుస్సు, సామాలనే మూడు వేదాల రూపమై ఉండేవాడైన ఈ విష్ణువు అనేసూర్యుని లోపల ఉన్నది. ప్రతి నెల ఉదయించే సూర్యుని లోపల త్రయీమయమైన ఆ గొప్ప విష్ణు శక్తి నిలిచి ఉన్నది. త్రయీమయమైన ఈ విష్ణుశక్తి శుద్ధసత్వ స్వరూపమైనది. తన ఏడు వస్తువులలో ఒకటి అయిన సూర్యుని వ్యాపించి ఉన్నది. ఆ విష్ణు శక్తిచే వ్యాపింపబడిన ఈ సూర్యుడు తన కిరణాలతో ప్రకాశిస్తున్నాడు. లోకంలో ఉండే చీకటి అంతా నాశనం చేస్తున్నాడు. ఈ విధంగా ఈ విష్ణుశక్తి అనేది ఏనాడూ నాశనం పొందడం లేదు. ప్రతి మాసం సూర్య

మండలంలో ఉంటూ అతనిని వ్యాపించి ఉన్నది) – అని పరాశర భగవానులు శ్రీవిష్ణుపురాణంలో (2— 11) విరివిగా వివరించారు. అందుచేత సూర్యమండలం మధ్యలో ఉండేవాడు భగవానుడైన నారాయణుడే అనే విషయం శృతిస్మృతులలో ఏకకంఠంగా నిర్ణయింపబడింది – అనే విషయం స్పష్టం.

**(తత్ భర్గః)** సూర్యమండలం లోపల ఉండే ఆ తేజస్సును నపుంసకలింగాలైన **"తత్ వరేణ్యమ్"** అనే ఈ రెండు పదాలతో పరామర్శింపబడే **భర్గః** అనేది నపుంసకలింగంగానే ఉండాలి కనుక, ఇది కాంతి అనే అర్థాన్ని కల 'స'కారాంత నపుంసకలింగ పదంగానే ఉండాలి – అని నిర్ణయింపబడినది. ఈ కారణం చేతనే శివుని తెలిపే అకారాంత నపుంసకలింగ పదం కాదు – అనేది కూడా స్పష్టమవుతున్నది. అందుచేత గాయత్రిని శివపరం చేయడం కోసం శైవులు చేసే ప్రయత్నం వ్యాకరణం తెలిసినవారి గోష్ఠిలో విలువను పొందదు అని ఏర్పడుతున్నది. ఇంతేకాక పూర్వం ప్రస్తావించిన **"భర్గాఖ్యం విష్ణుసంజ్ఞం సవితుర్వరేణ్యం తు"** అని మొదలైన స్మృతులు కూడా 'ఇక్కడ చెప్పబడేవాడు విష్ణువే' అనే విషయాన్ని వివరిస్తున్నాయి. '24 వేల శ్లోకాలను కల శ్రీరామాయణం మొత్తం 24 అక్షరాలను కల గాయత్రిని వివరిస్తున్నది' – అనేది సర్వలోకప్రసిద్ధం. ఇందువల్ల కూడా రామాయణంలో ప్రతిపాదించబడ్డ పరమపురుషుడైన నారాయణుడే గాయత్రిలో కూడా చెప్పబడుతున్నాడు – అని స్పష్టమవుతున్నది. అందుచేత ఇక్కడ **భర్గః** అని తేజస్సుగా చెప్పబడేవాడు **"నారాయణపరో జ్యోతిః, ఆదిత్యవర్ణం, విద్యుతః పురుషాదధి"** అని మొదలైన పలు వేదవాక్యాలలో జ్యోతిర్మయమైన మేనిని కలవాడుగా చెప్పబడిన నారాయణుడే అవుతున్నాడు. వీటిని అన్నిటినీ మనసులో ఉంచుకొని శ్రీ పరాశర భట్టర్ శ్రీ రంగరాజస్తవం ఉత్తర శతకంలో:

**"తేజఃపరం తత్ సవితుర్వరేణ్యం**
**ధామ్నా పరేణాప్రణఖాత్ సువర్ణమ్,**
**త్వాం పుండరీకేక్షణమామనంతి**
**శ్రీరంగనాథం తముపాసిషీయ"**

(సూర్యమండలం లోపల ఉండేవాడవుగా, ఆశపడదగినవాడవుగా, గొప్పదైన అప్రాకృతమైన శరీరంలో గోళ్ళనుండి తలవరకు స్వర్ణమయమై ఉండేవాడవుగా, గొప్ప తేజస్సువుగా, పుండరీకాక్షుడవై ఉండేవాడవుగా నిన్ను వేదాలు తెలుపుతున్నాయి. అటువంటి శ్రీరంగనాథుడవైన నిన్ను ఉపాసిస్తాము) అని గాయత్రీ మంత్రార్థాన్ని అనుసంధించారు.

**(వరేణ్యం భర్గః)** ఆశపడదగిన తేజస్సు అనే అర్థం వచ్చే **"వరణీయమ్"** అనే పదం **"వరేణ్యమ్"** అయినది.

**(భర్గః)** అందరిచే భజింపదగినవాడని, అందరిని భరించేవాడని, అన్ని పాపాలను పాకం చేసేవాడు (పోగొట్టేవాడు) అని ఈవిధంగా పలు రీతులుగా భర్గశబ్దానికి అర్థం చెప్పవచ్చు.

**(ధీమహి)** ఆ తేజస్సును ధ్యానిస్తాము. **"నారాయణాయ విద్మహే వాసుదేవాయ ధీమహి", "నారాయణం మహాజ్ఞేయమ్"** ఇత్యాది వేదాంతవాక్యాలను అనుసంధించాలి.

**(వరేణ్యమ్)** ఇష్టమైనది అనే అర్థాన్ని గ్రహించవచ్చు

**(సవితుః వరేణ్యమ్)** సూర్యుని కంటే గొప్పది, సూర్యుడు కూడా ఆశపడదగినది అనే అర్థాలను చెప్పవచ్చు. సూర్యునకు కూడా తేజస్సును ఇచ్చేది అనే విషయం **"యదాదిత్య గతం తేజః జగత్ భాసయతేఖిలమ్, తత్తేజో విద్ధి మామకమ్"** (ఆదిత్యుని లోపల కూడా ఉండి, లోకాన్ని అంతటినీ ప్రకాశింపజేసే తేజస్సు నా తేజస్సే) అని గీతలో భగవంతుడే చెప్పాడు కదా.

**(యః) "యత్ భర్గః"** అని అర్థం. ముందు చెప్పబడిన తేజస్సు అనే ఏ భగవంతుడు,

**(నః ధియః ప్రచోదయాత్)** మన బుద్ధిని తన విషయంలో ఆసక్తి కలిగి ఉండేటట్లు ప్రేరేపిస్తున్నాడో,

**(తత్ భర్గః ధీమహి)** ఆ తేజస్సును ధ్యానిస్తాము అని అన్వయం.

**(యః నః ధియః ప్రచోదయాత్)** నిద్రించే మన ఇంద్రియాలను ఎవడు ప్రేరేపిస్తున్నాడో – అనే అర్థాన్ని చెప్పవచ్చు.

**"అంతః ప్రవిశ్య మమ వాచమిమాం ప్రసుప్తాం**
**సంజీవయత్యఖిలశక్తిధరః స్వధామ్నా,**
**అన్యాంశ్చ హస్తకరణశ్రవణత్వగాదీన్**
**ప్రాణాన్ నమో భగవతే పురుషాయ తస్మై"**

(సకల శక్తులను ధరించే ఎవడు లోపల ప్రవేశించి ఉండి, నా నిద్రించే వాక్కును, ఇంకా, చేతులు, కాళ్ళు, చెవులు, చర్మం మొదలైన ఇంద్రియాలను, ప్రాణాలను తన తేజస్సుతో ప్రేరేపిస్తున్నాడో, అటువంటి ఆ పురుషునకు నమస్కారం) అని వాక్యంలోని అర్థం భగవంతుని పరంగా భాగవతంలో ఉపబృంహణం చేయబడింది.

ఈ సందర్భంలో అప్పయ్య దీక్షితులు కొన్ని పూర్వపక్షాలను చేశారు. **"తత్"** అనే నపుంసకలింగపదంతో పరామర్శింపబడే **భర్గ**శబ్దం సకారాంత నపుంసక లింగమై ఉండాలి కనుక, శివవాచకం కాదు అని చెప్పడం తగదు. **"తత్"** అనే దానిని ఛాందసంగా గ్రహించవచ్చు కనుక, మీ వాదంలో కూడా **"యః"** అనే దానిని ఛాందసంగా గ్రహించవలసి ఉన్నది గనుక, ఇద్దరికీ సమానమైన దోషమే అని అప్పయ్య దీక్షితులు అన్నారు. కానీ, ఈ వాదం సరికాదు. ఉపక్రమానికి తగినట్లుగానే ఉపసంహారానికి అర్థం చెప్పాలి – అని మీమాంసకన్యాయం ఉన్నందున, ఉపక్రమంలో పఠింపబడిన తచ్ఛబ్దానికి అనుగుణంగా చివరలో కూడా **"యః"** అనే శబ్దానికి అర్థం గ్రహించడమే సమంజసం కనుక, మన పక్షమే బలం ఎక్కువగా కలిగి ఉన్నది.

దీనికి పిమ్మట ఇంకొక వాదాన్ని చేశారు. **తత్** అనే పదం బ్రహ్మ వాచకంగా భగవద్గీత మొదలైనవానిలో ప్రసిద్ధం కనుక, **"సవితుః వరేణ్యం తత్ ధీమహి యః భర్గః నః ధియః ప్రచోదయాత్"** అని అన్వయించి అర్థాన్ని చెబితే ఏ పదాన్నీ ఛాందసమని చెప్పకుండా అర్థాన్ని నిర్వహించవచ్చు. **"యః భర్గః"** అని అకారాంత పుంలింగంగానే ఏర్పడుతున్నందున, శివవాచకం

అవుతున్నది – అని ఈ విధంగా అర్థాన్ని గ్రహించడంలో కూడా పలు దోషాలు ఉన్నాయి. రెండవ పాదంలో ఉండే భర్గశబ్దాన్ని మూడవ పాదంలో ఉండే యచ్ఛబ్దంతో చేర్చడంవల్ల దూరాన్వయం అనే దోషం వస్తుంది. ఇంతేకాక, **"యత్తదోః నిత్యసంబంధాత్"** అనే నియమానుసారం యచ్ఛబ్దంకూడా తచ్ఛశబ్దంతో చేరే ఉంటుంది. పూర్వం చెప్పినట్లు తచ్ఛశబ్దాన్ని విశేష్య పదంగా చేసి అర్థం గ్రహిస్తే యచ్ఛబ్దం ప్రత్యేకంగానే ఉంటుంది. దానికోసం ఒక తత్ శబ్దాన్ని అధ్యాహారం చేసుకోవాలి. అందుచేత, ఈ విధంగా పలు దోషాలను కల ఈ అన్వయం ఆదరించదగినది కాదు.

ఇంతేకాక, సూర్యమండలంలో ఉండే పురుషుడు పుండరీకాక్షుడు అనే విషయాన్ని ఛాందోగ్యోపనిషత్తు చాలా స్పష్టంగా తెలుపడం ఇంతకుముందే చెప్పబడింది. మైత్రాయణీయ ఉపనిషత్తులో కూడా ఈ విషయం ఘోషింపబడడం ఇక వివరింపబడుతున్నది.

**“అత్ర హి సౌమ్యాగ్నేయసాత్వికమండలాని భిత్వా తత్ శుద్ధసత్వాంతరావస్థితం అచలమ్ అమరమ్ అచ్యుతమ్ ధ్రువమ్ విష్ణుసంజ్ఞకం స్వధర్మం ధర్మసత్ కామసర్వజ్ఞత్వసంయుక్తం స్వతంత్రచైతన్యం స్వే మహిమ్ని నిష్ఠమానం పశ్యతి"**

(ఈ సూర్యమండలం లోపల ఉండే సోమునియొక్క, అగ్నియొక్క సాత్విక మండలాలను భేదించుకొని, దాని లోపల ఉండే శుద్ధసత్వం లోపల ఉండేదై, చలించనిదై, మరణం లేనిదై, భక్తులను విడువనిదై, స్థిరమై, విష్ణువు అనే పేరును కలిగినదై, అందరికీ ఆధారమై ఉండేదై, సత్యకామత్వం, సర్వజ్ఞత్వం మొదలైన గుణాలను కలిగినదై, స్వతంత్రమై, జ్ఞానస్వరూపమై, తన మహిమలోనే నిలిచి ఉండేదైన తేజస్సును దర్శిస్తున్నాడు) అని మైత్రాయణీయ ఉపనిషత్తులోని ఆరవ ప్రపాఠకంలో గాయత్రీమంత్రార్థ విచారణలో చెప్పబడింది. “**అచ్యుతమ్**” అని, **"విష్ణుసంజ్ఞమ్"** అని చెప్పబడినందున ఇది పరమపురుషుని పరమే అనే విషయం కరతలామలకన్యాయంలో ప్రకాశిస్తున్నది.

**"సూర్యమధ్యే స్థితః సోమః తస్య మధ్యే సుధాశనః,**
**తేజోమధ్యే స్థితం సత్వం సత్వమధ్యే స్థితోచ్యుతః,**

**ఏష వై పురుషో విష్ణుః వ్యక్తావ్యక్తః సనాతనః"**

(సూర్యునకు మధ్యలో సోముడు ఉన్నాడు. అతనికి మధ్యలో అగ్ని ఉన్నాడు. అగ్నిమధ్యలో శుద్ధసత్వమున్నది. దాని మధ్యలో అచ్యుతుడున్నాడు. ఇతడే స్థూలసూక్ష్మ ప్రపంచమై, సనాతనుడై, పురుషుడు అనే పేరును కలవాడై ఉండే విష్ణువు – అని యోగయాజ్ఞవల్క్య, యమశంఖస్మృతులలోను,

**"సంధ్యే ద్వే సంస్థితః సూర్యః తస్య మధ్యే స్థితః శశీ,**
**చంద్రమధ్యే హుతాశస్తు సర్వతేజోమయో హరిః,**
**అంగుష్ఠమాత్రః పురుషః తస్య మధ్యే మయోదితః,**
**శంకరేణ సదా దృశ్యః స్వత్ప్రకారోతితేజసా,**
**స విష్ణుః భువనాధారో యస్యేదం సకలం జగత్"**

(సూర్యుడు రెండు సంధ్యాకాలాలను పొందేటప్పుడు చంద్రుడు అతనికి మధ్యలో ఉన్నాడు. చంద్రుని మధ్య అగ్ని, అతని మధ్య బొటనవేలు పరిమాణాన్ని కలవాడై, పురుష శబ్దంచేత చెప్పబడేవాడై, తేజోమయుడైన హరి వేంచేసి ఉన్నట్లు నాచే చెప్పబడ్డాడు. అతడు శంకరునకు కూడా కనబడనివాడు. **సత్** అనబడే వస్తువును ప్రకారంగా కలవాడు. మిక్కిలి తేజస్సుతో కూడినవాడు. ఆ విష్ణువే సకలభువనాలకు ఆధారం. అతనికి సకలజగత్తు శేషం) అని ఆగ్నేయపురాణంలో కూడా ఈ మైత్రాయణీయ ఉపనిషత్ వాక్యం విష్ణుపరంగా వివరింపబడింది.

మైత్రాయణీయ ఉపనిషత్తులో 'ఆదిత్య మండలంలో ఉండేవాడు విష్ణువు అనే పేరు గలవాడైన అచ్యుతుడే' అని నిర్ణయించి, **"తత్ సవితుః వరేణ్యమ్"** అని ఇతడే గాయత్రిలో ఉపాసింపబడేవాడు అని చెప్పబడింది. ఇక్కడ **"విష్ణుసంజ్ఞకమ్"** అని, **"అచ్యుతమ్"** అని రెండు నామాలు చెప్పబడ్డాయి. ఆ విధంగా ఉండగా, **"భర్గో ప్రజయతీతి వైష రుద్రః"** అనే వాక్యంలో భర్గశబ్దంచే చెప్పబడేవాడు రుద్రుడు – అని ఈ ఉపనిషత్తులో పఠింపబడినందున, గాయత్రి రుద్రపరమే అని అప్పయ్య దీక్షితులు వాదించారు. పూర్వం చూచిన వాక్యంలో **"ఇతి"** అని రెండు శబ్దాలు పఠింపబడడం గమనించాలి. దీని వాస్తవమైన అర్థం ఏమంటే – **"భర్గః"** – పాపాలను

పోగొట్టేవాడు కనుక, ఇతడు భర్గుడు అవుతున్నాడు – అని రుద్రుడు చెప్పాడు అనేదే. అందువల్ల దీనినిబట్టి రుద్రపరత్వం సాధించడానికి వీలు లేదు. లేక, చెప్పబడేవాడు రుద్రుడు అని ఈ వాక్యానికి అర్థం గ్రహించినా, పూర్వం ప్రస్తావించిన **"విష్ణుః, అచ్యుతః"** అనే రెండు నామాలకు అనుగుణంగా ఇదికూడా విష్ణువును నిర్దేశిస్తున్నది అని చెప్పాలి. **"రుద్రో బహుశిరా బభ్రుః"** అని మొదలైన చోట్ల ఇది విష్ణునామంగా పఠింపబడింది కదా. **"విష్ణుసంజ్ఞకమ్"** అని విష్ణునామం సంజ్ఞగా చెప్పబడగా, దానికి విరోధంగా రుద్రనామానికి అర్థం గ్రహించడం న్యాయవిరుద్ధం అవుతుంది. అందుచేత ఈ వాక్యాలు విష్ణుపరాలే అనేది వజ్రలేపాయితం అయినది.

**"విష్ణుసంజ్ఞకమ్"** అని పూర్వం ప్రస్తావించిన మైత్రాయణీయ శృతివాక్యం అప్పయ్య దీక్షితులచే కూడా 'శివతత్వవివేకం' అనే గ్రంథంలో ప్రస్తావింపబడింది. ఆ గ్రంథానికి ఖండనంగా వ్రాయబడిన 'వేదాంతకౌస్తుభం'లో కూడా పూర్ణంగా ఉదాహరించబడింది.పెరియ వాచ్చాన్ పిళ్ళైచే కూడా 'తనిశ్లోకం'లో ప్రస్తావింపబడింది. ఈ విధంగా ఉండగా, స్మార్తులచే అచ్చువేయబడిన మైత్రాయణీయ ఉపనిషత్తులో ఇవి కనిపించడం లేదు. క్రీస్తుపూర్వం 1870వ సంవత్సరంలో లండన్ లో E.B.Cowell అనేవారి ఆంగ్లానువాదంతో బెంగాల్ ఏసియాటిక్ సొసైటీ తరపున ప్రచురించిన మైత్రాయణీయ ఉపనిషత్తులో ఆరవ ప్రపాఠకం చివర ఇవి కనబడుతున్నాయి. వాస్తవాన్ని ఎవరు మరుగుపరచాలని చూసినా అది తప్పక బయటపడుతుంది అనే దానికి ఇది ఒక ఉదాహరణ. తలవకారశ్రుతిలో **"తస్యా ఏష తృతీయపాద ధియో యో నః ప్రచోదయాదితి యజ్ఞో వై ప్రచోదయాత్"** (ఆ గాయత్రికి మూడవ పాదం **"ధియో యో నః ప్రచోదయాత్"** అనేది. యజ్ఞపురుషుడుకదా మన బుద్ధిని ప్రేరేపిస్తున్నాడు) అనే ఒక వాక్యం ఉన్నది. **"యజ్ఞో యజ్ఞపతిః యజ్వా"** అని శ్రీవిష్ణు సహస్రనామంలో, శ్రీ భాగవతం మొదలైన పురాణాలలో వేల సంఖ్యలోని సందర్భాలలో **యజ్ఞ**శబ్దం విష్ణునామాలలో ఒకటిగా పఠింపబడింది కనుక, దీనివల్ల కూడా గాయత్రి భగవత్ పరమే అని నిర్ణయింపబడుతున్నది. భగవత్ పరంగా వివరించే పలు ఉపబృంహణ వాక్యాలు ఇంతకు ముందే చాలా చూపబడ్డాయి. ఇంకా మరి కొన్ని ఉపబృంహణ వాక్యాలు చూపబడుతున్నాయి.

**"సంధ్యయోరుభయోః కాలే విష్ణుం ధ్యాత్వా సనాతనమ్,**
**నిర్మలాత్మార్కసందర్శీ గాయత్రీ మారభేత్ పునః"**

(రెండు సంధ్యాకాలాలలో సనాతనుడు అయిన విష్ణువును ధ్యానం చేసి, మలినం లేని మనసు కలవాడై, సూర్యుని చూస్తూ బుద్ధిమంతుడై ఉండేవాడు గాయత్రిని ఆరంభించాలి) అని యోగయాజ్ఞవల్క్యునిచే ఇంకొక చోట కూడా చెప్పబడింది. జాబాలిస్మృతిలో సైతం ఈ క్రింది వచనం కనబడుతున్నది.

**"రశ్మిమాలాసహస్రాఢ్య మమలం విపులం రవే,**
**తదంతః శ్రీదలాభం తు సౌమ్య సోమస్య మండలమ్,**
**స్ఫురత్ స్ఫులింగ మనలజ్వాలామాలాసమాకులమ్,**
**తస్య మధ్యే సుఖాసీనం తప్తహాటకసన్నిభమ్,**
**చతురంగులమాత్రం తు శుకపత్రనిభాంబరమ్,**
**రక్తనేత్రం హరిం రక్తపాణిపాదనఖాంశుకమ్,**
**శంఖచక్రగదాపాణిం శ్రీవత్సాంకితవక్షసమ్,**
**ఏవం ధ్యాత్వా జపేన్మంత్రం సావిత్రం నియత శ్శుచిః"**

(వేలాది కిరణజ్వాలను కలిగినది, మలినం లేనిది, చాలా గొప్పగా వెలుగుతున్నది – సూర్యమండలం. దానిలో చల్లని కాంతిని కలిగినదై, మధురమైనదై వెలుగుతున్నది – చంద్రమండలం. దాని మధ్యలో అగ్నిజ్వాలా మాలలచే చుట్టబడినది, కరిగించిన బంగారంవంటిది, నాలుగు అంగుళాల పరిమాణాన్ని కలిగినది, చిలుక రెక్కవంటి పీతాంబరాన్ని, ఎర్రని నేత్రాలను కలిగినదై, ఎర్రని చేతులు, కాళ్ళు, గోళ్ళు మొదలైనవాటిని కలిగి, శంఖ–చక్ర–గదలను చేతులలో ధరించినదై, శ్రీవత్సం అనే పుట్టుమచ్చను గుర్తుగా కలిగిన వక్షస్సును కలదైన మేనితో కూడినవాడైన హరిని ఈ విధంగా ధ్యానం చేసి, నియమాలతో కూడినవాడై, పరిశుద్ధుడై, గాయత్రీమంత్రాన్ని ధ్యానించాలి) అని సనక స్మృతిలో చాలా స్పష్టంగా తెలుపబడింది.

**“అర్చంతి మునయో నిత్యం జలేన రవిమండలే,**
**ఆదిత్యమండలే నిత్యం దేవదేవ మనామయమ్,**
**శంఖచక్రగదాపాణిం ధ్యాత్వా విష్ణు ముపాసనే" (62–16)**

(మునులు ప్రతి దినం సూర్య మండలంలోని భగవానుని అర్ఘ్యజలంతో ఆరాధిస్తున్నారు. ఆదిత్య మండలంలో దేవదేవుడు, ఏ రోగం లేనివాడు, శంఖ–చక్ర–గదలను చేతులలో ధరించినవాడు అయిన విష్ణువును ప్రతిదినం ధ్యానంచేసి, ఉపాసిస్తున్నారు) అని ఆరంభించి, **"ధ్యేయః సదా"** అని మొదలైన శ్లోకాలను నరసింహ పురాణం పలికింది. మహాభారతంలోని అశ్వమేథపర్వంలో:

**"ఊర్ధ్వబాహుః సదా భూత్వా సూర్య మీక్షేత్ సమాహితః,**
**తన్మండలస్థం మాం ధ్యాయేత్ తేజోమూర్తిం చతుర్భుజమ్,**
**ఉదుత్యం చ జపేన్మంత్రం చిత్రం తచ్చక్షురిత్యపి,**
**సావిత్రీం యథాశక్తి జప్త్వా సూక్తం చ మామకమ్"**

చేతులను పైకెత్తినవాడై, శాంతుడై, సూర్యుని దర్శించాలి. ఆ సూర్యమండలంలో ఉండేవాడను, తేజోమూర్తిని నాలుగు చేతులను కలవాడైనైన నన్ను ధ్యానించాలి. **"ఉదుత్యమ్", "చిత్రమ్", "తచ్చక్షుః"** అని ఆరంభం అవుతున్న మంత్రాలను జపించాలి. సాధ్యమైనంతవరకు గాయత్రిని, నాకు సంబంధించిన పురుషసూక్తాన్ని జపించి) అని ధర్మరాజును ఉద్దేశించి శ్రీకృష్ణుడు చెప్పిన మాటలు గాయత్రీ మంత్రం కేశవపరమే – అనే విషయాన్ని తెలుపుతున్నవి. సాత్విక శాస్త్రాలలో ఇంతగా ఉపబృంహణ వచనాలు ఉన్నప్పుడు లింగపురాణం మొదలైన తామస గ్రంథాలనుండి ఒకటి, రెండు వచనాలను చూపి, గాయత్రిని శివపరంగా అన్వయించాలని ప్రయత్నించడం వ్యర్థప్రయత్నం అనేది సుస్పష్టం.

పూర్వం తెలిపిన అన్వయాన్నిబట్టి, ‘ఏ తేజస్సు మన బుద్ధిని తన విషయంలో ప్రేరేపిస్తున్నదో, సూర్యునిలో ఉండేది, కోరదగినదగినది అయిన ఆ తేజస్సును ధ్యానిస్తాము’ – అనే అర్థం వ్యక్తమవుతున్నది. ఈ అర్థమే ఛాందోగ్యశ్రుతి వాక్యాలకు, పైన ప్రస్తావించిన

పురాణవచనాలకు, **"తేజః పరమ్"** ఇత్యాది భట్టర్ సూక్తులకు పొసగుతుంది. అయితే, ఈ యోజనలో **"ధియో యో నః"** అనే చోట ఉండే **"యః"** అనే పదాన్ని చాందసంగా గ్రహించవలసిన ఒక లోటు ఉన్నది. ఇంతేకాక, గాయత్రికి **"సవితా దేవతా"** అని పఠింపబడుతున్నది. గాయత్రీప్రతిపాద్యుడు పరమాత్మయే అని పలు పురాణాలలో చెప్పబడుతున్నందున ఈ సవితృశబ్దం పరమాత్మవాచకమే కావాలి. ఆ విధంగా ఉండగా, గాయత్రీ శరీరంలో ఉండే సవితృశబ్దాన్ని పరమాత్మ వాచకంగా గ్రహించకుండా సూర్యపరంగా గ్రహించవలసిన ఒక లోటు కూడా ముందు తెలిపిన యోజనలో ఉన్నది. ఈ రెండు కొరతలు లేని విధంగా ఒక యోజన పురాణాలలో, ఆచార్యులచే తెలుపబడుతున్నది.

**యః** – ఏ దేవుడు, **నః ధియః ప్రచోదయాత్** — మన బుద్ధిని ప్రేరేపిస్తున్నాడో, **తస్య దేవస్య సవితుః** – ఆ దేవుడైన సవిత అనబడే పరమాత్మ యొక్క, **వరేణ్యం తత్ భర్గః** – కోరదగిన, ఆ జ్యోతిర్మయమైన స్వరూపాన్ని, (లేక గుణాలను), **ధీమహి** – ధ్యానం చేస్తాము – అని అర్థం. ఈ యోజనలో **"యః"** అనే పదాన్ని ఛాందసంగా చెప్పనక్కరలేదు. సవితృశబ్దం కూడా పరమాత్మ వాచకం అవుతుంది.

**"యో దేవస్య సవితాస్మాకం ధియో ధ్యానాదిగోచరః,**
**ప్రేరయేత్ తస్యతత్ భర్గః తద్వరేణ్యముపాస్మహే"**

(సృష్టికర్త కనుక సవిత అనే పేరు కలిగిన ఏ దేవుడు మన బుద్ధిని ధర్మార్థకామమోక్షాలలో ప్రవర్తించేటట్లు ప్రేరేపిస్తున్నాడో, అతనికి చెందిన, ఆశపడదగిన గుణాలను ఉపాసిస్తున్నాము) అని అగస్త్యసంహితలోను,

**"దేవస్య సవితుః తస్య ధియో యో నః ప్రచోదయాత్,**
**భర్గో వరేణ్యం తత్ బ్రహ్మ ధీమహీత్యర్థ ఉచ్యతే"**

(ఎవడు మన బుద్ధిని ప్రేరేపిస్తున్నాడో ఆ దేవుడైన సవిత యొక్క జ్ఞానప్రకాశ రూపమై, ఆశపడ దగినది, బ్రహ్మ శబ్దం చేత చెప్పబడేదై ఉండే ఆ స్వరూపాన్ని ధ్యానిస్తూ ఉన్నాము) అని

గాయత్రీమంత్రాన్ని సాక్షాత్కరింప చేసికొన్న విశ్వామిత్రుని సంహితలో సవితృశబ్దాన్ని పరమాత్మ వాచకంగా గ్రహించి, తరువాత పూర్వం తెలుపబడిన రీతిలో అర్థం చెప్పబడింది. శ్రుతప్రకాశికాచార్యులవారు సంధ్యావందనభాష్యంలో ఈ అర్థాన్ని ఆదరించారు. ముందు తెలిపిన రెండు శృతి వచనాలను గాయత్రీజపానికి ముందు పలువురు అనుసంధించచడం ప్రసిద్ధం. ఇక ఈ అర్థాన్ని వివరిస్తాను.

**(సవితుః)** సవితయొక్క అని అర్థం. **"షూఙ్ —ప్రాణిప్రసవే"** అని ధాతువు కనుక, సర్వలోకస్రష్ట అయిన భగవంతుడు **సవిత** అని అనబడుతున్నాడు. ఇక్కడ సృష్టిని చెప్పడం స్థితిసంహారాలకు కూడా ఉపలక్షణం. సమస్త జగత్తును సృష్టించి, రక్షించి, లయం చేయడం ఇతనికి చాలా శ్రమ సాధ్యమై ఉంటుందా? వీటిని చేయడం వల్ల ఇతనికి ఏమి ప్రయోజనం? అనే సందేహాలు లేవగానే, అవి ఇక నివర్తింపజేయబడుతున్నాయి.

**(దేవస్య)** సృష్టి మొదలైనవానిని లీలగా చేసేవానియొక్క అని అర్థం. **"దివు— క్రీడా"** అని కదా ఇక్కడ ధాతువు. ఈ అర్థాన్ని**"క్రీడా హరేరిదం సర్వం క్షరమిత్యవధార్యతామ్"** (నశించే వీనిని అన్నిటిని హరియొక్క లీలగా తెలియబడుగాక) అని, **"క్రీడతో బాలకస్యేవ చేష్టాం తస్య నిశామయ, మోదతే భగవాన్ భూతైః బాలః క్రీడనకైరివ"** (చిన్న కుర్రవాడు ఆట వస్తువులతో ఆనందించేటట్లు, భగవంతుడు ప్రాణులతో ఆనందిస్తున్నాడు) అని మహర్షులు, **"లోకవత్తు లీలాకైవల్యమ్"** (లోకంలో ప్రభువులు మొదలైనవారికి వలె, భగవంతునకు కూడా లోకాన్ని సృష్టించడం మొదలైనవి కేవలం లీలను ఫలంగా కలిగినవి) అని బాదరాయణులు, **"అఖిలభువన జన్మ స్థేమభంగాదిలీలే"** (లోకాన్ని అంతటిని సృష్టించి, రక్షించి లయం చేయడం లీలగా కలిగినవాని విషయంలో) అని శ్రీరామానుజులు, **"నాట్టై ప్పడై యెన్ఱయన్ ముదలా త్తన్ద నళిర్ మామలరున్ది వీట్టైప్పణ్ణి విళైయాడుమ్ విమలన్"** అని గోదాదేవి, **"ఇన్బుఱు ఇవ్విళైయాట్టుడైయాన్"** (వినోదాన్ని కలిగించే ఈ లోకసృష్టిని లీలగా కలవాడు) అని నమ్మాళ్వార్లు ఈ అర్థాన్ని అనుసంధించారు.

**(దేవస్య)** "**దివు – క్రీడా విజిగీషావ్యవహార ద్యుతి స్తుతిమోదమద స్వప్న కాంతి గతిషు**" అనే విధంగా **దివు** ధాతువు అనేక అర్థాలను కలిగినది అయినందున ఇతడే నిరుపాధిక దేవుడని, "**దివ్యో దేవ ఏకో నారాయణః**" అని వేదం, "**భవాన్ నారాయణో దేవః**" , " **సాక్షాత్ దేవః పురాణోసౌ**" అని ఋషులు, "**శిలైయినాల్ ఇలజ్గై శెర్ర దేవనే దేవనావాన్**" (వింటితో లంకను నాశనం చేసిన దేవుడే దేవుడు) అని ఆళ్వార్లు ఈ అర్థాన్ని నిశ్చయించారు. దేవశబ్దార్థాలు అన్నీ ఇక్కడే పొసగి ఉండే రీతిని శ్రీసూక్తవ్యాఖ్యానంలో గమనించవచ్చు.

**(తద్వరేణ్యం భర్గః)** ఆశపడదగినదై, వేదాంతాలలో ప్రసిద్ధమైన గుణాలను – అని అర్థం.

**(తత్)** దీనిద్వారా "**తస్మిన్ యదంతః తదన్వేష్టవ్యమ్ తద్వావ విజిజ్ఞాసితవ్యమ్**" (పరమాత్మలో ఉండే ఆ గుణసమూహం అన్వేషించదగినది; అది తెలియదగినది) అనే శ్రుతిప్రసిద్ధిని భావించాలి.

**(వరేణ్యమ్)** అందరిచే ఆదరించదగినవి, పువ్వుకు సువాసన వలె, తేనెకు మాధుర్యంవలె, సూర్యునకు కాంతివలె ఉంటూ, భగవంతునకు గొప్పతనాన్ని ఇచ్చేవి కదా, ఈ గుణాలు. "**సోశ్నుతే సర్వాన్ కామాన్**" అని మోక్షప్రాప్యంగా చెప్పబడినవి కదా, భగవంతుని గుణాలు. "**ఉనదు పాలేపోల్ శీరిల్ పఴుత్తొழిన్దేన్**" (పాలవలె మధురంగా ఉండే నీ కళ్యాణ గుణాలలో నేను పండిపోయాను), "**నిన్రు ఎనదావియై ఈర్ కిన్ర గుణంగళ్**" (నిలచి నా మనసును చీలుస్తున్న భగవంతుని కళ్యాణ గుణాలు), "**గోవిందన్ గుణమ్ పాడి ఆవి కాత్తిరుప్పేనే**" (గోవిందుని గుణాలను కీర్తించి నా ఆత్మను రక్షించుకుంటాను) అని దివ్యసూరులు కూడా ఈ కల్యాణగుణాలలోనే కదా ఆసక్తులయ్యారు.

**(భర్గః)** గుణసమూహాన్ని అని అర్థం. ఇక్కడ "**ర**" అనే అక్షరం అధికంగా పఠింపబడుతున్నది. అంటే "**భగః**" అని అర్థం. ఈ విధంగానే యజుర్వేదంలో "**అప్ససీక్షాసన్ సువరప్రతీతత**" అనే సందర్భంలో "**అప్రతీత**" అనే దానికి బదులుగా "**ఆప్రతీతత**" అనికదా ఉన్నది. భగశ్శబ్దం గుణాలను ఏ విధంగా తెలుపుతుంది? అని అంటే,

**"ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసః శ్రియః,**

**జ్ఞానవైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా"**

(పూర్ణమైన ఐశ్వర్యం, వీర్యం, కీర్తి, సంపద, జ్ఞానం, వైరాగ్యం అనే ఆరు గుణాలకు భగస్సని పేరు – అని శ్రీవిష్ణుపురాణంలో భగశ్శబ్దం గుణాలను తెలుపుతుందని చెప్పబడింది. **"తత్"** అనేదానికి తగినట్లు ఈ భగశ్శబ్దాన్ని సకారాంత నపుంసక లింగపదంగా గ్రహించాలి. అకారాంత శబ్దంగా గ్రహిస్తే ద్వితీయా విభక్తి అర్థంలో ప్రథమా విభక్తి పఠింపబడిందని చెప్పాలి. ఇక్కడ ఆరు గుణాలను భగశ్శబ్దానికి అర్థంగా చెప్పడం **"వశీ వదాన్యః"** మొదలైనచోట్ల చెప్పబడిన సమస్త కళ్యాణ గుణాలకు ఉపలక్షణం. **"భజ్యతే ఇతి భగః"** (భజనం చేయబడుతున్నది కనుక గుణసమూహం **"భగః"** అనబడుతున్నది) అనే వ్యుత్పత్తివల్ల భగశ్శబ్దం గుణ వాచకం కావడం గమనించవచ్చు.

**(ధీమహి)** పూర్వం చెప్పిన సమూహాన్ని ధ్యానం చేస్తాము – అని అర్థం. **"ధ్యై—చింతాయామ్"** అనేది ఇచట ధాతువు.

**(వరేణ్యం తత్ భర్గః)** అందరిచే ఆదరింపదగినది, వేదాంత ప్రసిద్ధమైన భగవత్ స్వరూపాన్ని– అని అర్థం చెప్పవచ్చు.

**(వరేణ్యమ్)** జ్ఞానానందమయం అయినందున చేతనులు అందరిచే ఆదరింపదగినది. **"న చ సీతా త్వయా హీనా"** (నిన్ను విడిచిన సీత తన సత్తను కోల్పోతుంది), **"నిన్నలాల్ ఇలేన్ కాణ్"** (నీవు లేకపోతే నేను లేను సుమా), **"నానున్నై యన్హి ఇలేన్ కండాయ్ నారణనే!"** (నారాయణా!నిన్ను విడిస్తే నేను లేను సుమా!) అని చెప్పిన రీతిలో విడిస్తే భరించలేని రీతిలో కదా భగవంతుని స్వరూపం ఉంటుంది. **"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"** , **"విజ్ఞాన మానందం బ్రహ్మ", "తత్ విజిజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి"** అని మొదలైన వేదాంతవాక్యాలలో ప్రసిద్ది పొందింది కదా, భగవంతుని దివ్యాత్మస్వరూపం.

**(భర్గః)** భగవత్ స్వరూపాన్ని అని అర్థం. భర్గశ్శబ్దం భగవత్స్వరూప వాచకం ఏ విధంగా అయింది? అంటే:

**"భాభిః గతిరస్య హీతి భర్గో ప్రజయతీతి వైషః భర్గః భాసయతీమాన్ లోకానితి రంజయతీమాని భూతాని గచ్ఛంత్యస్మిన్ ఆగచ్ఛంత్యస్మాత్ ఇమాః ప్రజా స్తస్మాత్ భర్గత్వాత్ భర్గః"**

(తన ధర్మభూతజ్ఞానకాంతులతో ఈ స్వరూపానికి గమనం ఉన్నందున ఇది భర్గమనబడుతున్నది. పాపాలను పోగొట్టడంచేత ఇది భర్గమనబడుతున్నది. ఈ లోకాలను ప్రకాశింపజేయడంవల్ల **భ**కారవాచ్యంగాను, ఈ జీవరాసులను రంజింపజేయడం వల్ల **ర**కారవాచ్యంగాను, ప్రళయంలో ఇతనిలోపలకు ఈ ప్రజలు వెడుతున్నందున, సృష్టిలో ఇతనినుండి బయటకు వస్తున్నందున **గ**కారవాచ్యంగాను అవుతున్నందున **భర్గ**మనబడుతున్నది.) అని మైత్రాయణీయ ఉపనిషత్తులోని ఆరవ ప్రపాఠకంలో:

**"సంభర్తేతి తదా భర్తా భకారోర్థ త్వయా న విత్,**
**నేత్ర గమయితా స్రష్టా గకారార్థ స్తదా మునే!"**

(ఓ మునివరా! ప్రకృతిని కార్యదశను పొందించేవాడు, స్వామి— అనే రెండు అర్థాలతో కూడినది, భకారం. ఆ విధంగానే, రక్షించేవాడు, సంహరించేవాడు, సృష్టించేవాడు అనేది గకారం యొక్క అర్థం) అని శ్రీ విష్ణుపురాణంలో భగస్స్వరూపాన్ని తెలిపే దారులు విరివిగా చెప్పబడ్డాయి.

**(సవితుః భర్గః)** పరమాత్మ యొక్క స్వరూపం అని అర్థం. రాహువే శిరఃస్వరూపమై ఉండగా, రాహువుయొక్క శిరస్సు— అని ప్రయోగించడంవంటిదే, ఈ ప్రయోగం కూడా.

ఈ అర్థయోజనలో కూడా **"భర్గః, ధీమహి"** అనేదానికి భగవంతుని దివ్యమైన మంగళరూపాన్ని ధ్యానిస్తాము – అనే అర్థాన్ని గ్రహించవచ్చు. స్వరూపాదులను ధ్యానించడం శ్రమ సాధ్యం. దివ్యమంగళ రూపాన్ని ధ్యానించడం సులభం. అందువల్లనే ఈ దివ్యమంగళవిగ్రహం శుభాశ్రయం అనే కీర్తిని పొందింది.

ఈ విధంగా ఇంతవరకు "దేవుడైన సూర్యుని లోపల ఉండే ఆదరించదగిన ఆ తేజస్సును ధ్యానిస్తున్నాము" అని, "సర్వలోకస్రష్ట అయిన దేవుని ఆదరించదగిన ఆ స్వరూపాన్ని, (లేక గుణాలను, లేక, తిరుమేనిని ) ధ్యానిస్తున్నాము" అని రెండు అర్థాలు చెప్పబడ్డాయి.

**"ధియో యో నః ప్రచోదయాత్"** అనే భాగానికి మొదటి అర్థంలో "ఏ తేజస్సు మన బుద్ధులను ప్రేరేపిస్తున్నదో" అనే అర్థం, రెండవ యోజనలో "ఏ దేవుడు మన బుద్ధులను ప్రేరేపిస్తున్నాడో" అనే అర్థం వస్తుంది. ఈ రెండు అర్థాలే శ్రుతులచే, స్మృతులచే, ఆచార్యులచే ఆదరింపబడ్డాయి. వీటికి విరుద్ధంగా పలువురు పలు విధాలైన అర్థాలను గాయత్రీ మంత్రానికి చెబుతున్నారు. అవి అన్నీ వైదికులైనవారిచే అనాదరించదగినవి. భర్గశ్శబ్దానికి శివుని అర్థంగా చెప్పడం కూడా తప్పు. భట్టభాస్కరులు, విద్యారణ్యులు, సారదీపకారులు, నిర్ణయ కల్పవల్లీ కారులు, వరదరాజులు, కృష్ణభట్టర్ మొదలైన పలువురు భాష్యకారులు ఈ అర్థాన్ని అనాదరించారు.

ఈ విధంగా భగవంతుని మంత్రాలకే సంసారసంబంధాన్ని పోగొట్టే సామర్థ్యం ఉన్నది అని నిరూపింపబడినది. మిగిలిన దేవతల మంత్రాలకు అటువంటి గొప్పతనం వేదవేదాంతాలలో ఎక్కడా చెప్పబడలేదు.



# ఊర్ధ్వపుండ్రమహిమ

*(తమిళ మూలం: ఉ.వే శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యఙ్గార్ స్వామివారు)*

వైదికులు అందరూ తమ నుదుటిలో ఏదో ఒక చిహ్నాన్ని ధరిస్తారు. దీనిని పుండ్రమని అంటారు. పుండ్రాలు అనేక విధాలు. వీటిలో ముఖ్యంగా రెండు రీతులు ఉన్నాయి. నిలువుగా ధరింపబడే పుండ్రం ఊర్ధ్వ పుండ్రం. అడ్డంగా ధరింపబడే పుండ్రం తిర్యక్ పుండ్రం. ఈ రెండు విధాలైన పుండ్రాలు రెండు విధాలైన అధికారులకోసం శాస్త్రాలలో విధింపబడ్డాయి.

జంతువులు, పక్షులు వివేకం లేనివి. ఉన్నత గతి అయిన మోక్షాన్ని పొందాలనే ఆశ లేనివి. ఈ లోకంలో కాని, క్రింది లోకంలో కానీ జన్మను పొందగలవే తప్ప, అవి పైలోకాలకు వెళ్లే దారి లేదు. అందువల్లనే సర్వేశ్వరుడు వాటిని తిర్యక్కులుగా పుట్టించాడు.

మానవులు వివేకం కలవారు. ఉన్నత గతిని పొందడంకోసమే బ్రహ్మచే సృష్టింపబడినారు. అందుచేతనే సర్వేశ్వరుడు వారిని ఉన్నతగతిని చేరగలిగేటట్లు సృష్టించాడు. అయినా, అనాది వాసనవల్ల పలువురు మానవులు ఉన్నతగతికి వెళ్ళాలనే అభిప్రాయం లేకుండా ఉన్నారు. ఈ లోకంలోని అనిత్యమైన ప్రయోజనాలను పొంది, **"గతాగతం కామకామా లభంతే"** (గీత–9–21) (ఈ లోకంలోని ప్రయోజనాలను ఆశపడేవారు సంసారంలోనే పరిభ్రమిస్తున్నారు) అని గీతలో చెప్పినట్లు తిర్యగ్గతిని పొందుతున్నారు. ఇటువంటివారికి కూడా ఇహలోక ప్రయోజనాలను అనుగ్రహించడంకోసం పలువురు దేవతలను పరమాత్మ సృష్టించాడు. మానవుడై ఉండి కూడా తిర్యక్కులవలె తిర్యగ్గతిలోనే పరిభ్రమించే వీరికోసం తిర్యక్ పుండ్రాన్ని శాస్త్రాలలో భగవంతుడు విధించాడు. ఉన్నత గతికి వెళ్ళాలి అని భావించేవారికోసం ఊర్ధ్వపుండ్రాన్ని వాసుదేవుడు విధించాడు.

ఈ విధంగా చెప్పినప్పుడు, తిర్యక్ పుండ్రాన్ని ధరించే మన మిత్రులు కొందరు కోపగించుకోవచ్చు. తిర్యక్ పుండ్రాన్ని ధరించేవారందరూ, ఆ విధంగా ధరించినందున, నీచగతిని

పొందుతారు అని, ఊర్ధ్వ పుండ్రాన్ని ధరించేవారు ఆ కారణం చేతనే, ఉన్నత గతిని పొందుతారని చెప్పడం లేదు. తిర్యక్ పుండ్రాన్ని ధరించేవారిలో కూడా క్రమక్రమంగా ఉన్నత గతిని చేరగలిగిన ఉత్తమమైనవారు కొందరు ఉన్నారని, ఊర్ధ్వపుండాలను ధరించేవారిలో కూడా నరకానికి పోవలసిన ఎవరూ లేరని అనడం లేదు. ఉన్నత గతిని చేరాలని భావించేవారు ధరించదగినది ఊర్ధ్వపుండ్రమని, తిర్యగ్గతికి పోవాలని కోరుకునేవారు ధరించవలసిది తిర్యక్ పుండ్రమనేది ఇక్కడ భావం. దీనికి శాస్త్రాలలో అనేక ప్రమాణాలు ఉన్నాయి. ముక్తిని ఇచ్చే ముకుందుని త్రికరణాలతో ఆశ్రయించే భక్తులు ఉర్ధ్వపుండ్రాన్ని ధరిస్తున్నారు అనే విషయం, అతని గొప్పదనాన్ని, సంపదను నిరాకరించేవారు ఇంచుమించుగా తిర్యక్ పుండ్రాన్ని ధరిస్తున్నారనే విషయం మనఃసాక్షి కలవారిచే కాదనడానికి వీలు లేనిది. తిర్యక్ పుండ్రం యొక్క తక్కువదనం, ఊర్ధ్వపుండ్రంయొక్క గొప్పతనం తెలుసుకున్న స్మార్తులలో, అద్వైతులలో పలువురు జ్ఞానులు భస్మంతో తిర్యక్ పుండ్రాన్ని పెట్టుకోకుండా, చందనం మొదలైనవాటితో ఊర్ధ్వపుండ్రాన్ని పెట్టుకోవడం ఈనాటికీ చూస్తున్నాము. ఇక, ఊర్ధ్వ.పుండ్రం ఉన్నతగతి అయిన మోక్షాన్ని ఇవ్వగలిగినది అనే విషయాన్ని ఉపనిషత్తులు తెలిపే ప్రకారాన్ని చూద్దాం.

**ధృతోర్ధ్వపుండ్రః పరమేశితారం**
**నారాయణం సాంఖ్యయోగాదిగమ్యమ్,**
**జ్ఞాత్వా విముచ్యేత నర స్సమస్తైః**
**సంసారపాశైరిహ చైవ విష్ణుమ్**

(ఊర్ధ్వపుండ్రాన్ని ధరించే యోగి పరమేశ్వరుడు, కర్మ జ్ఞాన భక్తి యోగాలతో పొందదగినవాడు, సర్వవ్యాపి అయిన నారాయణుని తెలిసికొని, సంసారంలోని సకల పాపాలనుండి విముక్తుడై, ఈ జన్మ చివర మోక్షసుఖాన్ని పొందుతున్నాడు) అని బ్రహ్మోపనిషత్తులో తెలుపబడింది.

**"ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ**
**విష్ణుం పరం ధ్యాయతి యో మహాత్మా,**

**స్వరేణ మంత్రేణ సదా హృది స్థితం**
**పరాత్పరం యన్మహతో మహాంతమ్"**

(ఊర్ధ్వపుండ్రాలను ధరించినవాడై, చక్రాన్ని శరీరంపై అంకితం చేసుకున్నవాడైన ఏ చేతనుడు, గొప్పవారిలో గొప్పవాడు, తనతో పోలినవారు, మించినవారు ఎవరూ లేనివాడై, ఎల్లప్పుడు హృదయకమలంలో ఉండేవాడైన మహావిష్ణును ఓంకారమనే మంత్రంతో నిరంతరం చింతిస్తున్నాడో, అతడే మహాత్ముడు) అని కఠశాఖలో కూడా ఘోషింపబడింది.

**"హరేః పాదాకృతిమ్ ఆత్మనో హితాయ మధ్యే ఛిద్రమ్ ఊర్ధ్వపుండ్రం యో ధారయతి స పరస్య ప్రియో భవతి స పుణ్యవాన్ భవతి స ముక్తభాక్ భవతి"**

(హరిపాదాల వంటి రూపాన్ని కలిగినది, మధ్యలో చోటును కలిగినది అయిన ఊర్ధ్వపుండ్రాన్ని ఎవడు తన హితంకోసం ధరిస్తున్నాడో, అతడు పరమ పురుషుని ప్రీతిని పొందుతున్నాడు. అతడు పుణ్యశాలి అవుతున్నాడు. అతడు ముక్తిని పొందుతున్నాడు) అని అధర్వణవేదం పలికింది. ఈ మూడు ప్రమాణాలు శ్రీ వేదాంతదేశికులచే **సచ్చరిత్ర రక్ష** అనే గ్రంథంలో ప్రస్తావింపబడ్డాయి. స్మార్తులైన వైద్యనాథ దీక్షితులు కూడా వీటిని ప్రమాణంగా చూపించారు.

**“అర్చనాదౌ యజ్ఞమూర్తేరూర్ధ్వపుండ్రం కులం తారయేత్ సప్త స గచ్ఛేత్ వైష్ణవం పదమ్"**

(యజ్ఞరూపి అయిన భగవానునియొక్క అర్చన మొదలైనవానిలో ఊర్ధ్వపుండ్రాన్ని ధరించేవాడయితే, అతడు ఏడుతరాలవారిని ముక్తిని పొందిస్తున్నాడు; అతడు విష్ణుపదం పొందుతున్నాడు) అని భల్లశాఖలో స్తుతింపబడినదని దేశికులు తెలిపారు.



# తాపసంస్కారమహిమ

*(తమిళ మూలం: ఉ.వే.శ్రీమాన్ కృష్ణస్వామి అయ్యఙ్గార్ స్వామివారు)*

**"తాపః పుండ్రః తథా నామ మంత్రో యాగశ్చ పంచమః**
**అమి పంచసంస్కారాః పరమైకాంతిహేతవః"**

చక్రధారణం, పుండ్రధారణం, దాస్య నామకరణం, మంత్రోపదేశం, తిరువారాధన అనే ఇవి అయిదు పరమైకాంతి స్వభావాన్ని కలిగించే సంస్కారాలు – అని శాస్త్రాలలో చెప్పబడింది. వైష్ణవులకు అందరికీ చేయవలసిన సంస్కారాలు ఇవి. బ్రాహ్మణత్వాన్ని పొందడానికి ఏ విధంగా ఉపనయనం ఆవశ్యకమో, ఆ విధంగానే వైష్ణవత్వాన్ని పొందడానికి ఈ పంచసంస్కారాలు చాలా అవశ్యకం.

కొందరు 'శంఖ చక్రాలను ధరించడానికి వేదంలో ఏ ఆధారం లేదు' అని, 'వాటిని ధరించడం అవైదికం' అని అంటున్నారు. వైష్ణవులలో కూడా కొందరు తమ మాటలతో మోసగిస్తున్నారు. పూర్వాచార్యుల కాలంలోనే ఈ వాదాలు ఉన్నాయి. వేదాంతాలను తెలిసినవారిలో గొప్పవారైన శ్రీ వేదాంత దేశికులు శంఖ చక్రధారణాన్ని విధించే వేదవాక్యాలను చూపించి, **సచ్చరిత్ర రక్ష** అనే గ్రంథంలో పూర్వం తెలిపిన వాదాలను ఖండించారు. ఆ వాక్యాలు ఇప్పుడు చూపబడతాయి.

అధర్వణ వేదానికి చెందిన మహోపనిషత్ లోని బ్రహ్మసూక్తంలో:

**"దక్షిణే తు భుజే విప్రో బిభృయాద్వై సుదర్శనమ్,**
**సవ్యే తు శంఖం బిభృయాదితి బ్రహ్మవిదో విదుః"**

(బ్రాహ్మణుడైనవాడు కుడిభుజంలో సుదర్శనచక్రం గుర్తును, ఎడమ భుజంలో శంఖం గుర్తును ధరించాలి – అని వేదం తెలిసినవారు తెలిసికొంటున్నారు) అని చెప్పబడింది.

యజుర్వేదంలోని కఠశాఖలో:

**"ధృతోర్ధ్వపుండ్రః కృతచక్రధారీ**
**విష్ణుం పరం ధ్యాయతి యో మహాత్మా,**
**స్వరేణ మంత్రే సదా హృది స్థితం**
**పరాత్పరం యన్మహతో మహాంతమ్"**

(ఎవడు మహాత్ముడై ఉన్నాడో, అతడు ఊర్ధ్వపుండ్రాన్ని, చక్రాన్ని ధరించినవాడై, గొప్పవారి కంటే గొప్పవాడై, ఎల్లప్పుడు హృదయకమలం వేంచేసి ఉండేవాడైన విష్ణువును అతనికి వాచకమైన మంత్రంతో ధ్యానిస్తున్నాడు) అని ఘోషింపబడింది.

ఋగ్వేదపౌష్కలసంహితలో:

**"ప్రతే విష్ణో అబ్జచక్రే పవిత్రే**
**జన్మాంభోధిం తర్తవ్యే కర్షణీంద్రా,**
**మూలే బాహ్వోః దధతేన్యే పురాణో**
**లింగాన్యన్యే తావకాన్యాపయంతి"**

(భగవన్! జ్ఞానులలో గొప్పవారు నీ శంఖ చక్రాలను జన్మ సముద్రాన్ని దాటడం కోసం తమ బాహుమూలాలలో ధరిస్తున్నారు. ఇంకా కొందరు పూర్వులు (భుజాలు, తల, ఫాలం, హృదయం అనే) తమ అవయవాలలో నీ పంచాయుధాలనే చిహ్నాలను ధరిస్తున్నారు) అని ఘోషింపబడింది. యజుర్వేదంలోను, అధర్వణంలోను, సుదర్శనోపనిషత్తులోను:

**"నిచిక్షేప సుషణం భిద్యమానం**
**మధ్యే బాహుమద్ధత్ సుదర్శనమ్,**
**విష్ణోరిద భూరిదం భూరితేజః**
**ప్రధర్షతి దివానక్తం బిభృయుస్తజ్జనాసః"**

(ఎవడు, చాలా గొప్పగా ప్రకాశిస్తున్నది, విష్ణువునకు చెందినది అయిన సుదర్శనాన్ని తన బాహుమూలంలో ధరిస్తున్నాడో, అతడే చాలా బాధించే పాపాలను పోగొట్టుకుంటున్నాడు. అతడు

రాత్రి, పగలు తన శత్రువులను జయిస్తున్నాడు. మిగిలినవారు సంసారాన్ని పొందుతున్నారు) అని పఠింపబడింది. ఋగ్వేదంలోను, సామవేదంలోను:

**"చమూషచ్ఛ్యేన శ్శకునో బిభృత్వా**
**గోవిందుర్ద్రప్స ఆయుధాని బిభర్త,**
**అప్రమూర్మిమ సచమాన స్సముద్రం**
**తురీయం ధామ మహిషో వివక్తి"** (ఋగ్వేద–అష్టక–7–4–9)

(భగవంతుని విభూతిలో చాలా చిన్న భాగం అయిన ఒక ఆవగింజ, గోవిందుని ఆయుధాలను ధరించినందున నిత్యసూరుల గోష్ఠిని పొందింది. ప్రకృతి సంబంధం చేత వచ్చే ఆకలి దాహం మొదలైన బాధలనే కెరటాలను కల సంసారసాగరంలో మునిగి ఉండేవాడు ఆ ఆయుధాలను ధరిస్తే అందరిచేత పూజింపబడే పరమపదాన్ని పొందుతాడు) అని చెప్పబడింది. ఆధర్వణంలో:

**"ఏభిర్వయ మురుక్రమస్య చిహ్నైః**
**అంకితా లోకే సుభగా భవేమ,**
**తద్విష్ణోః పరమం పదం యే**
**గచ్ఛంతీహ వాంఛితాః"**

(త్రివిక్రమావతారం ఎత్తిన భగవంతుని చిహ్నాలతో అంకితం చేయబడినవారు ఎవరైనా, వారు విష్ణువుయొక్క విలక్షణమైన పరమపదాన్ని పొందుతున్నారు. మనం కూడా ఈ గుర్తులను పొందినవారమై, భగవంతుని అంతరంగ కింకరులుగా కాగలము) అని ఘోషింపబడింది.

ఋగ్వేదంలో:

**"చక్రం బిభక్తి వపుషాభితప్తం**
**బలం దేవానాం మమితస్య విష్ణోః,**
**స ఏతి నాకం దురితా విధూయ**

**ప్రయాంతి యద్యతయో వీతరాగాః"**

(దేవతలకు రక్షణమైనది, పరిపూర్ణుడైన విష్ణువుయొక్క జ్వలించే చక్రాన్ని ఎవడు తన శరీరంలో ధరిస్తున్నాడో, అతడు పాపాలు తొలగిపోయినవాడై, సంసార సంబంధం లేని మునులు పొందే పరమపదాన్ని పొందుతున్నాడు) అని చెప్పబడింది. సామవేదంలో కూడా:

**"నేమినా తప్తతనూ బ్రహ్మణః సాయుజ్యం సలోకతాతమాప్నోతి"**

(చక్రంచేత తపింపజేయబడిన శరీరాన్ని కలవాడు విష్ణుసాయుజ్య సాలోక్యాలను పొందుతున్నాడు) అని చెప్పబడింది. అన్ని వేదాలలోను

**"పవిత్రం తే వితతే బ్రహ్మణస్పతే**
**ప్రభుః గాత్రా ణి పర్యేతి విశ్వతః,**
**అతప్తతనూన తధామో అశ్నుతే**
**శ్రుతాస ఇద్వహంత స తత్ సమాసతే"** (ఋగ్వేదం–అష్టకమ్–7–3–8)

(వేదప్రతిపాద్యుడవైన ఓ భగవన్! పవిత్రం అనే పేరును కల నీ సుదర్శనం అంతటా వ్యాపించి ఉన్నది. అన్నిటికి ప్రభువైన నీవు నీ చిహ్నమైన చక్రంతో స్వీకరిస్తున్నావు. చక్రధారణం చేయకపోతే పాపం తీరనివాడై, ఆ పరతత్త్వాన్ని పొందలేడు. చక్రాన్ని ధరించినవాడు పాపం తొలగినవాడై పరమాత్మ అయిన నిన్ను పొందుతున్నాడు) అని చెప్పబడింది. పవిత్రం అనే శబ్దంతో ఇక్కడ సుదర్శనం చెప్పబడింది అనేది **"పవిత్రమిత్యగ్నిః అగ్నిర్వై సహస్రారో నేమిః"** (పవిత్రమనే శబ్దం చక్రాన్ని తెలుపుతుంది. అగ్ని అనేది వేయి అరాలను కలిగిన సుదర్శనం) అని సామవేదంలోను, **"సుదర్శనం చక్రం పవిత్రం చరణమ్"** అని నిఘంటువులోనూ చెప్పబడింది. కాఠకంలో:

**"చరణం పవిత్రం వితతం పురాణం**
**యేన పూతః తరతి దుష్కృతాని,**
**తేన పవిత్రేణ శుద్ధేన పూతాః**

**అతిపాప్మాన మరాతిం చరేమ"**

('శరణం' అని, 'పవిత్రం' అని చెప్పబడే పురాతనమైన చక్రంతో ముద్రింపబడినవాడు పాపాలను దాటుతున్నాడు. శుద్ధమైన ఆ పవిత్రంతో పరిశుద్ధం చేయబడిన మనం పాపాలనే విరోధులను దాటుతున్నాము) అని చెప్పబడింది. **"చరణమ్"** అనే పదం సుదర్శనాన్ని తెలుపుతుంది – అనేది పూర్వం ప్రస్తావించిన నిఘంటువచనం కూడా తెలుపుతున్నది. పాంచరాత్రంలో కూడా **"పవిత్రం చరణం చక్రమ్"** అనేవి సుదర్శనుని నామాలుగా పఠింపబడ్డాయి.

ఇంకా, యజుర్వేదంలో మూడవ ప్రశ్నలో:

**"కక్షముపౌక్షేత్ యది దహతి పుణ్యసమమ్ భవతి, యది న దహతి పాపసమమ్"**

(భుజంలో చక్రంతో తపింపబడాలి. దహింపబడితే పుణ్యం చేసినవాడవుతాడు. తపింపబడకపోతే పాపం చేసినవాడు అవుతాడు) అని చెప్పబడింది. **"ఉష"** అనేది ధాతువు దహించడం అనే అర్థాన్ని ఇస్తుంది. **"కక్షముప"** అనేదానికి **"ఉపకక్షమ్"** అని అర్థం. అది బాహుమూలాన్ని తెలుపుతుంది.



# విశిష్టాద్వైతమతం చాలా ప్రాచీనమైనది

*(తమిళ మూలం: ఉ.వే శ్రీమాన్ వంగీపురం వాసుదేవాచార్య స్వామివారు(*

వేదాంతులని వ్యవహరింపబడే వైదికులు ఈ కాలంలో, ఈ దేశంలో ముఖ్యంగా మూడు విధాలుగా కనబడుతున్నారు. శ్రీ శంకరాచార్యులవారి అద్వైతసిద్ధాంతాన్ని అనుసరించేవారు కొందరు. శ్రీ రామానుజాచార్యులవారి విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని అనుసరించేవారు మరి కొందరు. శ్రీ మధ్వాచార్యులవారి ద్వైతసిద్ధాంతాన్ని అనుసరించేవారు ఇంకొందరు. వీరందరూ ఉపనిషద్వాక్యాలను ప్రమాణంగా అంగీకరించినవారే అయినా, ఆ ఉపనిషద్ వాక్యాలకు అర్థం చెప్పడంలో మాత్రం ఒక్కొక్కమతం వారు ఒక్కొక్క అభిప్రాయాన్ని కలిగి ఉన్నారు. వీరిలో, మొదటి రెండు వర్గాలకు చెందినవారు ఆదరించే సిద్ధాంతాలు చాలా ప్రాచీనమైనవి అని చెప్పాలి. శ్రీ శంకరాచార్యులవారికి ముందు శ్రీగౌడపాదులు అనే ఒక ఆచార్యులు, వారికి ముందు ఇంకా కొందరు ఆచార్యులు అద్వైతాన్ని ఉపదేశించి, ప్రచారం చేశారని తెలుస్తున్నది. వారి కంటే కూడా ముందు చాలా ప్రాచీనులైన ఒక అద్వైతవర్గానికి చెందినవారు ఉన్నట్లు, ఆ వర్గానికి చెందినవారు చెప్పిన సిద్ధాంతంనుండి తరువాతి ఆచార్యులు భేదించినట్లు ఊహించే అవకాశం ఉన్నది. ఆ ప్రాచీనులైన అద్వైతులు మాయావాదాన్ని శంకరాచార్యులవారు బలపరిచినంతగా, బలపరిచినట్లు తెలియలేదు. శ్రీ రామానుజాచార్యులవారి పరంపర, శ్రీ బోధాయనులని ప్రసిద్ధులైన ఒక మహర్షి కాలంనుండి ఆరంభించి వచ్చినట్లు తెలుస్తున్నది. ఆ బోధాయనుల కాలంకూడా, వేదాంతసూత్రాలను రచించినవారు, మహాభారత కర్త అయిన వ్యాసమహర్షియే అని అంగీకరింపబడినవారైన శ్రీ బాదరాయణుల కాలానికి దగ్గర కాలమని చెప్పవచ్చు. ఈ బోధాయనులు బాదరాయణుల వేదాంత సూత్రాలకు చాలా విస్తృతమైన 'వృత్తి' అనే పేరు గల ఒక వ్యాఖ్యానాన్ని రచించినట్లు తెలుస్తున్నది. ఈ వృత్తిగ్రంథంలో వివరింపబడిన పలు విషయాలు శంకర భాష్యంలో పూర్వపక్షంగా ప్రస్తావించబడ్డాయి. ఈ వృత్తి గ్రంథానికి టంకుడు అనే పేరు గల ఆచార్యులు ఒక వ్యాఖ్యానం రచించారట. ఈ టంకుల వాక్యాలను 'వాక్యకారుల వాక్యాలు'

అని పలువురు భాష్యకారులు ఉదాహరించారు. బ్రహ్మనంది అని భాష్యకారులచే చెప్పబడిన వేదాంతి కూడా ఈ టంకులే అయి ఉండాలని పెద్దలు చెబుతున్నారు. శ్రీ వేదార్థసంగ్రహ వ్యాఖ్యాన కర్త అయిన శ్రీ సుదర్శనసూరి ఆ విధంగా ట్రంకులే బ్రహ్మనంది అని చెప్పడంతోపాటు, వేదాంత దేశికులు కూడా తత్త్వటీక అనే గ్రంథంలో ఆ విధంగానే తెలియజేశారు. ఈ టంకులు గొప్ప బ్రహ్మవేత్తగా, వాదాలలో అతిసమర్థులుగా ఉండి ఉండాలి అని ఒప్పుకోవాలి.

"ద్రవిడ దేశానికి చెందిన విద్వాంసుడు" అని అర్థం వచ్చే ద్రమిడాచార్యుడు అనే పేరు గల ఇంకొక విశిష్టాద్వైతాచార్యులు ఉపనిషత్తులకు ఒక భాష్యాన్ని రచించినట్లు తెలుస్తున్నది. శ్రీ రామానుజాచార్యులవారు ఈ ద్రమిడాచార్యులవారి సూత్రభాష్యాన్నే భాష్యమనే పేరుతో వ్యవహరించి, దాని నుండి పలు వాక్యాలను తమ శ్రీభాష్యంలో ఉదాహరించారు. శ్రీ శంకరాచార్యులవారి చాందోగ్యోపనిషద్ భాష్యానికి వివరణాన్ని రచించేటప్పుడు ఆనందగిరి అనే ప్రసిద్ధులైన అద్వైతవేదాంతి ఈ ద్రమిడాచార్యుల ఉపనిషద్ భాష్యాన్ని గురించి ప్రస్తావించి, అది ఒక పెద్ద గ్రంథమని అన్నారు. శ్రీ శంకరాచార్యులవారి ఉపనిషద్ భాష్యంలో కూడా కొన్ని కొన్ని చోట్ల ఆ కాలంలో ఇంకొక భాష్యం కూడా ఉన్నట్లు సూచించే కొన్ని వాక్యాలు కనిపిస్తాయి. ఈ ద్రవిడాచార్యుల ఉపనిషద్ భాష్యాన్ని వారు మనసులో పెట్టుకుని ఈ విధంగా వ్రాసి ఉంటారా! – అని భావించే అవకాశం ఉన్నది. ఆ కాలంలో ఇంకొక వేరు ఏ భాష్యం ఉన్నట్లు తెలియలేదు. వేదాంత సూత్రాలు మొదలైన పలు పలు మూల గ్రంథాలకు భాష్యాలను రచించిన శ్రీరామానుజాచార్యులవారు, వారి కాలానికి ముందున్న వేరు విశిష్టాద్వైత ఆచార్యులు కూడా ఉపనిషత్తులకు విశిష్టాద్వైతపరంగా భాష్యాన్ని దేనినీ రచించకుండా విడిచిపెట్టడానికి కారణం – అప్పటికి ఈ ద్రవిడాచార్యుల ఉపనిషద్ భాష్యం ప్రచారంలో ఉండి ఉండడమే – అని భావించే అవకాశం ఉన్నది.

ద్రవిడాచార్యులకు తరువాత శ్రీవత్సాంకులు, గుహదేవులనే ఇద్దరు గొప్ప ఆచార్యులు జీవించి ఉన్నట్లు తెలుస్తున్నది. శ్రీవత్సాంకులు అనేవారు ద్రవిడాచార్యుల సూత్రభాష్యానికి ఒక వ్యాఖ్యానాన్ని రచించారట. గుహదేవులు అనేవారు విశిష్టాద్వైత సిద్ధాంత విషయంగా కొన్ని

గ్రంథాలను రచించినట్లు తెలుస్తున్నది. అయితే, ఆ గ్రంథాలు ఒక్కటి కూడా ఇప్పుడు లభించడం లేదు. శ్రీభాష్యంలోను, శ్రీ వేదార్థ సంగ్రహంలోను ఉదాహరింపబడిన కొన్ని వాక్యాలు అటువంటి గ్రంథాలు ఉండేవి అనే విషయాన్ని తెలియజేస్తున్నవి తప్ప, వేరు ఏ విధమైన గుర్తులు వాటిని గూర్చి ఇప్పుడు లభించడం లేదు. ఈ ఆచార్యుల పేర్లు మాత్రం శ్రీ యామునాచార్యులవారి సిద్ధిత్రయంలోను, శ్రీరామానుజాచార్యులవారి వేదార్థసంగ్రహంలోను చాలా గౌరవంగా ప్రస్తావింపబడడాన్ని అందరూ గమనించవచ్చు. సిద్ధిత్రయంలో టంకులు, శ్రీవత్సాంకులు మొదలైన ఆచార్యుల పేర్లు, భర్తృమిత్రులు, భర్తృహరి, బ్రహ్మదత్తులు మొదలైన కొంతమంది అద్వైతాచార్యుల పేర్లతో కూడ ఉదాహరింపబడ్డాయి. శ్రీ వేదార్థసంగ్రహంలో బోధాయనులు, టంకుడు, ద్రవిడాచార్యులు, గుహదేవులు, కపర్ది, భారుచి అనేవారి పేర్లు మాత్రం కనబడుతున్నాయి. మహావిద్వాంసులైన ఈ ఆచార్యుల గ్రంథాలన్నీ ఈ విధంగా లుప్తమైపోయాయి అనేది చాలా విచారించదగిన విషయంకదా! అయినా, ఆ గ్రంథకారులచే రచింపబడిన అరుదయిన విషయాలన్నీ ఇప్పుడు ప్రచారంలో ఉండే శ్రీయామునాచార్యుల వారి సిద్ధిత్రయం మొదలైన గ్రంథాలలో, శ్రీరామానుజాచార్యులవారి శ్రీభాష్యం, శ్రీవేదార్థసంగ్రహం అనే ఈ రెండు గ్రంథాలలో ఉదాహరించబడి, రక్షింపబడుతున్నాయి అనేది కొంతవరకు సమాధానపడదగిన అంశం.

విశిష్టాద్వైత సిద్ధాంత ప్రాచీనత ఇంతమాత్రమే కాదు. శ్రీవిశిష్టాద్వైతులందరు పాంచరాత్రమతానుసారులు. ఈ పాంచరాత్రశాస్త్రం శ్రీమన్నారాయణునిచే ప్రకాశింపజేయబడింది అనేది వారి భావన. ఈ పాంచరాత్రంలో ఆలయాలలో, గృహాలలో భగవంతుని అర్చారూపిగా ఆరాధన చేయవలసిన కర్మలు చెప్పబడడంతో పాటు, ఉపనిషత్తులలో చెప్పబడిన తత్వహిత పురుషార్థాలు కూడా విస్తృతంగా, స్పష్టంగా వివరింపబడ్డాయి. చిత్తు, అచిత్తు, ఈశ్వరుడు అనే మూడు తత్వాలు, చేతనాచేతనాలకు, భగవంతునకు మధ్య ఉండే శరీరశరీరి భావం, శ్రీమన్నారాయణుడే పరదేవత అనే విషయం మొదలైనవి పాంచరాత్ర శాస్త్రంలో చేయబడిన తత్వనిర్ణయాలు. భగవంతుని శరణంగా ఆశ్రయించడమే మనకు గొప్ప

హితం – అని పాంచరాత్రంలో చెప్పబడే ఉపదేశంకూడా ఉపనిషత్తులకు పొసగుతుంది – అనేది విశిష్టాద్వైతుల అభిప్రాయం. పురుషార్థ విషయంలోకూడా ఉపనిషత్తులు చెప్పే విషయాలకు, పాంచరాత్రం చెప్పేదానికి ఏవిధమైన భేదం లేదు. అందుచేత భగవన్మతం అని చెప్పబడే పాంచరాత్ర సిద్ధాంతమే విశిష్టాద్వైతసిద్ధాంతమని చెప్పవచ్చు. పాంచరాత్ర సిద్ధాంతం మహాభారతంలో విస్తృతంగా వివరింపబడింది. శ్రీ బాదరాయణుడు తమ వేదాంతసూత్రాలలో ఈ పాంచరాత్రశాస్త్రాన్నిగూర్చి ప్రస్తావించారు. అందుచేత విశిష్టాద్వైత సిద్ధాంతం శ్రీవ్యాసుల కాలానికి పూర్వం కూడా ఉన్నది అని చెప్పవచ్చు. బ్రహ్మసూత్రాలు కానీ, భగవద్గీత కానీ, పాంచరాత్ర తంత్రాలు కానీ, ఎంతకాలానికి ముందు, ఎప్పుడు రచింపబడ్డాయి అనే విషయాన్ని నిర్ధారణ చేసి చెప్పడానికి ఇప్పుడు మనకు లభించే సామగ్రి సరిపోదు – అనేది వాస్తవం. ఇంతవరకు నిరూపించినవారు అందరూ గొప్ప ప్రయాసతో ఈ విషయంలో చేసిన ప్రయత్నాలన్నీ విఫలమై పోయాయి. అయినా, స్థూలంగా ఈ గ్రంథాలన్నీ చాలాకాలంగా వ్యవహారంలో ఉన్నాయి అని చెప్పడానికి ఆ సామగ్రి చాలు. వాటిని ఆధారంగా చేసుకొని మనం శ్రీవిశిష్టాద్వైతసిద్ధాంతాన్ని శ్రీవ్యాసుల కాలానికి ముందునుండి వ్యవహారంలో ఉన్న సిద్ధాంతమని చెప్పవచ్చు. దివ్యసూరులు అనబడే ఆళ్వార్లు కూడా ఈ సిద్ధాంతాన్ని ఆదరించినందున ఇది చాలా ప్రాచీనమని అంగీకరించవలసి ఉన్నది.



# ఉపనిషత్తులు - విశిష్టాద్వైత సిద్ధాంతం

*(తమిళ మూలం: ఉ.వే శ్రీమాన్ వంగీపురం వాసుదేవాచార్య స్వామివారు(*

అనాది కాలంగా ప్రచారంలో ఉండే విశిష్టాద్వైత సిద్ధాంతానికి ఉపనిషత్తులు ఏ విధంగా ముఖ్యమైన ఆధారం అనే విషయం, ఆ ఉపనిషత్ వాక్యాలు ఏ రీతిగా విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని బోధిస్తున్నవి అనే విషయం గమనించదగినవి. 'వేదార్థ సంగ్రహం' అనే గ్రంథంలో భగవద్రామానుజులు ఈ విచారాన్ని చేశారు. సమస్తకళ్యాణగుణాలతో కూడినవాడు, హేయ గుణాల సంబంధం ఏమీ లేనివాడై ఉండే శ్రీమన్నారాయణుడే జగత్తుకు అంతటికీ పరమ కారణమైన వస్తువు. చేతన వస్తువు అయిన జీవాత్మ, అచేతన వస్తువులైన ప్రాకృతపదార్థాలు అనే వీటి అన్నిటికంటే ఆ స్వామి చాలా విలక్షణుడు. అతడు చేతనాచేతన వస్తువులను అన్నిటిని తనకు శరీరంగా కలిగి ఉన్నాడు. అతడే సకల చేతనాలచే చివరిగా పొందదగినవాడు. ఆ విధంగా అతనిని పొందడానికి అతనికి కృపయే ముఖ్య ఉపాయం. ఆ కృపకు మనం అతని విషయంలో చేసే భక్తి, ప్రపత్తులు వ్యాజాలు అవుతున్నాయి. ఆ భక్తి కూడా వేదనం, ఉపాసనం మొదలైన శబ్దాలతో నిర్దేశింపబడే జ్ఞానవిశేషమే. అది ఉపాసకులచే చేయబడే వర్ణాశ్రమ ధర్మాచరణాన్ని అంగంగా కలిగినది. ఆ భగవంతుడు తన నిత్యేచ్ఛతో ఒక స్థాన విశేషంలో భక్తులకు ఆనందకరమైన ఒక దివ్యమంగళ విగ్రహంతో ఆవిర్భవించి ఉంటాడు. ఆ విగ్రహం, ఆ స్థానం అతని స్వరూపంవలె అందరికీ పరమప్రాప్యం అని మొదలైన అర్థాలే ఉపనిషత్తులలో చెప్పడుతున్నాయి – అని వేదార్థసంగ్రహంలో నిరూపింపబడినది.

ఉపనిషత్తులలో రెండు విధాలైన వాక్యాలు గోచరిస్తున్నాయి. కొన్ని వాక్యాలు బ్రహ్మం గుణం లేనిది అని తెలుపుతున్నాయి. మరి కొన్ని వాక్యాలు బ్రహ్మానికి జ్ఞానం, బలం మొదలైన కళ్యాణ గుణాలు అన్నీ ఉన్నాయి అని చెబుతున్నాయి. ఈ రెండు విధాలైన వాక్యాలు అర్థంలో పరస్పర విరుద్ధాలు కనుక ఈ రెండూ తత్త్వప్రతిపాదకాలు అనే అవకాశం లేదు. వీటిలో ఏదో ఒక విధమైన వాక్యాలే తత్త్వాన్ని ప్రతిపాదన చేసేవై ఉంటాయి – అని పైపైన చూసినప్పుడు తోస్తుంది.

అందుచేత, వేదాలకు ఆప్తత్వం సిద్ధించాలంటే ఈ రెండు విధాలైన వాక్యాల మధ్య పరస్పరం విరోధం రాకుండా ఉండే రీతిలో ఒక విధంగా సమన్వయం చేయడం సాధ్యమా? అనే అంశాన్ని విచారణ చేయవలసి ఉన్నది.

గుణాలు అన్నీ గుణియొక్క పరిచ్ఛేదాన్ని వ్యక్తం చేస్తాయి కనుక, అపరిచ్ఛిన్నం అయిన పరబ్రహ్మానికి గుణాలను చెప్పడం న్యాయానికి పొసగదు అని వాదించి, శ్రీశంకరాచార్యులవారు నిర్గుణవాక్యాలకే ప్రాధాన్యం ఇవ్వాలి – అని నిర్ణయించారు. **"ఏకమేవాద్వితీయమ్"** (వస్తువు ఒకటే, రెండవది లేదు), **"నేహ నానాస్తి"** (పలు విధాలుగా ఉండడమనేది ఇక్కడ లేదు) ఇత్యాదిగా పరబ్రహ్మను వివరించే వాక్యాలే వారికి ప్రమాణం. పరబ్రహ్మకు గుణాలు ఉన్నాయి అని చెప్పే వాక్యాలు అన్నీ వారికి అప్రమాణాలు అవుతున్నాయి. ఇవి కార్య బ్రహ్మమని వ్యవహరింపబడే మాయాగ్రస్త బ్రహ్మానికి సంబంధించినవి అని వాటిని వేరు చేసి పలికారు.

ఈ విధంగా ఉన్నతమైన పరబ్రహ్మనుగూర్చిన వాక్యాలు కొన్ని, నీచమైన పరబ్రహ్మను గూర్చిన వాక్యాలు మిగిలినవి – అని విభాగం చేయడానికి ఉపనిషత్తులలో ప్రమాణం ఏమి కనుపించదు అనేదే శ్రీరామానుజాచార్యులవారు ఇక్కడ చేసే ముఖ్యమైన ఆక్షేపం. ఉపనిషత్తులలో ఎక్కడాకూడా నిర్గుణబ్రహ్మం అనేది ఒకటి ఉన్నది అని చెప్పలేదు. కనుక 'క్షయం, వినాశం మొదలైన గుణాలు దానికి లేవు అనే తాత్పర్యంలోనే ఆ నిర్గుణవాక్యాలకు తాత్పర్యం' అని మనం అర్థాన్ని గ్రహించడం సమంజసం – అనేది శ్రీ రామానుజాచార్యులవారి అభిప్రాయం.

చేతనాచేతనవస్తువులు పరబ్రహ్మ కంటే భిన్నమైన వస్తువులే అని, అవి సత్యాలే అని అనడం, "బ్రహ్మం ఒకటే ఉన్నది" అని అనడంతో విరోధించదా? అనే సందేహానికి ఈ క్రింది విధంగా సమాధానం చెప్పవచ్చు. చేతనాచేతనాలు భిన్నమైన వస్తువులైనా, అవి పరబ్రహ్మను విడచి వేరుగా నిలచి ఉండే యోగ్యత లేనివిగాను, పరబ్రహ్మకు విశేషణాలుగాను ఉన్నందున, "బ్రహ్మం ఒకటే ఉన్నది" అని చెప్పే వాక్యాలతో చేతనాచేతనాల సత్యత్వం కాని, అస్తిత్వం కాని ఏ

విధంగానూ విరోధించదు. ప్రళయదశలోనూ, సృష్టిదశలోనూ ఈ పరబ్రహ్మం ఒకటే ఉన్నది. ప్రళయ దశలో చాలా సూక్ష్మంగా, ఏ విధంగా నామ రూపాలు లేనివై ఉండే చేతనాచేతనాలను తనకు విశేషణంగా ఆ బ్రహ్మం కలిగి ఉంటుంది. సృష్టి దశలో ఆ చేతనాచేతన వస్తువులే పరబ్రహ్మయొక్క సంకల్పంతో సూక్ష్మదశను విడిచి, స్థూలదశను పొంది, ప్రళయ దశలోవలెనే ఆ పరబ్రహ్మకు విశేషణాలుగా ఉంటాయి. ఈ విధంగా ఆ విశేషణాలకు పరబ్రహ్మను విడచి ప్రత్యేకంగా ఉండే స్థితి ఏ సమయంలోనూ లేదు కనుక, బ్రహ్మం ఒకటే ఉన్నది – అని అనడంలో ఏ విధమైన ఆక్షేపం చెప్పడానికి అవకాశం లేదు. ఇదే వారిచే చెప్పబడే సమాధానం. "బ్రహ్మం ఒకటే సత్యం, మిగిలినవి అసత్యం" అనేదానిని కూడా విశిష్టాద్వైతులు ఒక విధంగా అంగీకరిస్తున్నారు. సత్యమనే శబ్దానికి వికారానికి ఆస్పదం కాకుండా ఉండడాన్ని అర్థంగా పలికి, చేతనాచేతనాలను విశేషణంగా కల, ధర్మియై ఉండే పరబ్రహ్మ స్వరూపానికి ఏ విధమైన వికారం లేదు కనుక, విశేషణాలై ఉండే చేతనాచేతన వస్తువులకు మాత్రం సృష్టి ప్రళయకాలాలలో వికారాలు కలుగుతున్నందున బ్రహ్మం సత్యంగాను, మిగిలినవి అసత్యం గాను అవుతున్నాయి అని చెప్పవచ్చు – అని వారు వాదిస్తున్నారు. చేతనులకు జ్ఞానంలో సంకోచవికాసాలు అనే మార్పు, అచేతన వస్తువులకు స్వరూపంలో మార్పు ఉన్నది, ఆ కారణం చేత అవి అసత్యాలు అవుతున్నాయి – అని వారిచే అంగీకరింపబడింది. విశేషణాలుగా ఉండే చేతనాచేతనాలలో పరబ్రహ్మ యొక్క సంకల్పం కారణంగా ఏ విధాలైన వికారాలు గోచరించినా, వాటిని విశేషణాలుగా కలిగిన పరబ్రహ్మను ఆవి స్పృశించవు అనేది కూడా వారి అభిప్రాయం. ఈ విధంగా వారు అభిప్రాయపడడం – అవిద్యచే పరబ్రహ్మం ఆక్రమించబడినా, ఆ అవిద్యయొక్క కార్యాలచే ఆ బ్రహ్మం స్పృశింపబడకండా ఉంటుంది – అని అద్వైతులచే అంగీకరింపబడే అభిప్రాయంవంటిదే ఇది. ఈ విధంగా "బ్రహ్మం గుణం లేనిది" అనే అర్థం కల ఉపనిషద్ వాక్యాలకు హేయగుణాలు లేవు అని అనడంలో తాత్పర్యమని, సృష్టిని తెలిపే వాక్యాలకు చేతనాచేతనవస్తువులనే విశేషణాలు మాత్రం వికారాన్ని పొందుతున్నాయి అని అనడంలో తాత్పర్యమని, బ్రహ్మైక్యాన్ని చెప్పే వాక్యాలకు విశేషణాలతో కూడిన విశేష్య బ్రహ్మంలోనే తాత్పర్యమని, బ్రహ్మం అద్వితీయం (అంటే,రెండవది

లేదు) అనే వాక్యాలకు ఆ బ్రహ్మం కంటే వేరు నియంత లేదు అని అనడంలోనే తాత్పర్యమని అర్థం చెప్పే పక్షంలో పరస్పర విరుద్ధాలుగా తోచే వాక్యాలకు అన్నిటికీ సరి అయిన సమన్వయం చెప్పబడినట్లు అయినది కదా.



# ఆళ్వార్ల పాశురాలలో అలంకారాలు

*(ఉవే. శ్రీమాన్ ఈయుణ్ణి అళగ శింగరాచార్య స్వామివారి వ్యాసం(*

**కావ్య లక్షణం – అలంకారాలు:**

ఆలంకారికులు కావ్యలక్షణాన్ని నిర్దేశించేటప్పుడు అలంకారాలకు సముచిత స్థానాన్ని ఇచ్చారు. కావ్య పురుషుని అభివర్ణిస్తూ **"శబ్దార్థౌ మూర్తిరాఖ్యాతౌ"** అని శబ్దార్థాలు రెండూ కావ్య పురుషుని రూపంగా, **"జీవితం వ్యంగ్య వైభవమ్"** అని ధ్వనిని కావ్య పురుషునకు ఆత్మగా నిర్దేశించి, **"హారాదివదలంకారా అనుప్రాసోపమాదయః"** అని శబ్దాలంకార అర్థాలంకారాలు హార, కిరీటాది భూషణాలవలే కావ్యపురుషునకు అపూర్వ శోభను కలిగిస్తాయని అన్నారు. లోకంలో కూడా సామాన్యమైన అందాన్ని కలిగిన పురుషుడు సైతం చక్కని ఆభరణాలను ధరిస్తే అతని రూపంలో అపూర్వమైన చమత్కృతి గోచరించడం, చూసేవారి దృష్టిని ఆకర్షించగలగడం ప్రత్యక్షానుభవసిద్ధం. ఆవిధంగానే, కావ్యజగత్తులో కూడా అలంకారాలు కావ్య పురుషునకు అపూర్వమైన శోభను కలిగిస్తాయి. అందువల్ల అలంకార శాస్త్రజ్ఞులు కేవలం అలంకారాల లక్ష్య లక్షణాలను తెలిపే గ్రంథాలను కూడా విరచించారు. అలంకారశబ్దానికి కల **"అలం–పర్యాప్తం కరోతీతి అలంకారః"** (కావ్యపురుషుని శోభను పరిపూర్ణం చేస్తున్నది) అనే వ్యుత్పత్తి కూడా కావ్య ప్రపంచంలో అలంకారాలకు గల ప్రాధాన్యాన్ని తెలుపుతున్నది. ఈ అలంకారాలు శబ్దాలంకారాలని, అర్థాలంకారాలని, ఉభయా(మిశ్రా)లంకారాలని మూడు విధాలు. వీటిలో అర్థాలంకారాలకు ప్రాధాన్యం ఎక్కువ. శరీరాన్ని భూషించే హారాది అలంకారాలకు కంటే ఆత్మను భూషించే శమాది అలంకారాలకు కదా అధిక ప్రాధాన్యం!

**ఆళ్వార్ల దివ్య ప్రబంధాలు – మధుర కావ్యాలు:**

భగవానుడైన శ్రీమన్నారాయణుని కల్యాణగుణసాగరంలో ఓలలాడి, తమ మధురమైన అనుభూతిని కమనీయ కావ్యాలైన దివ్య ప్రబంధాల రూపంలో లోకానికి అనుగ్రహించిన భక్త శిఖామణులు, మహోదారులు ఆళ్వార్లు. వీరి కృతులలో నాయకుడు శ్రీమన్నారాయణుడు, నాయికా స్థానీయులు ఆళ్వార్లు. భగవద్విరహాన్ని సహించలేక తమ విశ్లేష వ్యసనాన్ని, నాయకుని ఎడబాసిన నాయికవలె, తమ ప్రబంధాలలో వెలువరించారు. ఆళ్వార్ల ప్రబంధాలన్నీ ఉత్తమ కావ్యలక్షణాలను కల్గి ఉన్నాయనే విషయం వాటిని గమనించి చూచినపుడు స్పష్టమవుతుంది. ఎన్నో అందమైన శబ్దర్థాలంకారాలు ఆళ్వార్ల దివ్యప్రబంధాలలో గోచరిస్తాయి.

**భగవద్విషయంలో అలంకారాల వ్యవస్థ:**

కానీ, ఇక్కడ ఒక విశేషాన్ని గమనించాలి. లోకంలోని అలంకారాలు కాని, గుణాలు కాని – వాటిని కల్గి ఉండే వ్యక్తికి శోభను కల్గిస్తాయి. భగవద్విషయంలో ఈ రీతి విపర్యస్తమని (వేరు విధంగా ఉన్నదని) అంటారు కూరేశులు. **"గుణాయత్తం లోకే గుణిషు హి మతం మంగళ పదం. విపర్యస్తం హస్తి క్షితిధర పతే! తత్ త్వయి పునః, గుణాస్సత్యజ్ఞాన ప్రభృతయ ఉత త్వద్గతతయా శుభీభూయం యాతా ఇతి నిరణైష్మశ్రుతివశాత్"** (లోకంలో సద్గుణాలను కల్గి ఉండడం వల్ల ఒక వ్యక్తికి మంగళత్వం చేకూరుతుంది. కాని, ఈ క్రమం వరదరాజస్వామి విషయంలో విపరీతమైనది. సత్యం, జ్ఞానం, ఆనందం మొదలైన సద్గుణాలకు, అవి భగవానుని ఆశ్రయించి ఉన్నందున, పవిత్రత కల్గింది – అని శ్రుతి ద్వారా నిర్ణయింపబడింది) అని కూరేశుల **వరదరాజస్తవ** సూక్తి. ఈ క్రమం గుణాలకే కాదు, అలంకారాలకు కూడా వర్తిస్తుంది. అందువల్లనే, ఈ వాస్తవాన్ని గ్రహించిన హనుమంతుడు శ్రీరాముని బాహువుల సౌందర్యాన్ని దర్శించి **"సర్వభూషణ భూషార్హాః"** (బాహువులకి పెట్టుకోదగిన అలంకారాలను అన్నిటిని భూషించగల్గిన బాహువులు) అని అన్నాడు. ఈ విషయం ప్రకృతంలో కూడా అన్వయిస్తుంది. లౌకికమైన సాహిత్యంలోని అలంకారాలు ఆయా కావ్యాల ద్వారా గోచరించే పురుషునకుశోభను కల్గించగా,

అలౌకిక సాహిత్యమైన ఆళ్వార్ల దివ్యప్రబంధాలలో గొచరించే అలంకారాలు, ఆ ప్రబంధాలకు ప్రతిపాద్యుడైన భగవానుని ఉద్దేశించి ప్రయోగింపబడ్డాయి కనుక, వాటికి ఒక అపూర్వశోభ కల్గిందని, సార్థక్యం చేకూరిందని చెప్పాలి. అందువల్ల **"అలంక్రియంతే భగవత్సంబంధేన ఇతి అలంకారాః"** (భగవత్సంబంధం వల్ల స్వరూపంలో పరిపూర్ణతను పొందుతున్నవి కనుక అలంకారాలు అనబడుతున్నాయి) అనే నిర్వచనాన్ని అలంకార శబ్దానికి ప్రకృతంలో గ్రహించవచ్చు.

**ఆళ్వార్ల దివ్య ప్రబంధాలలో అలంకారాలు:**

సంస్కృత సాహిత్యంలో **భామహుని 'కావ్యాలంకారం', దండి 'కావ్యాదర్శం', మమ్మటుని 'కావ్య ప్రకాశ', జయదేవుని 'చంద్రాలోకం', విశ్వనాథుని 'సాహిత్య దర్పణం', విద్యానాథుని 'ప్రతాపరుద్రీయం', అప్పయ్యదీక్షితుల 'కువలయానందం', పండితరాయల 'రసగంగాధరం'** వంటి అలంకారాల లక్ష్య లక్షణాలను తెలిపే గ్రంధాలు వెలువడినట్లే, తమిళ భాషలో కూడా **తొల్క్కాప్పియం, నన్నూల్, దండి అలంకారం, మాఱన్ అలంకారం** వంటి అలంకారాల లక్షణాలతో, లక్ష్యలతో కూడుకొన్న పలు అలంకార శాస్త్ర గ్రంథాలు రచింపబడ్డాయి. ప్రత్యేకించి, దండి అలంకార గ్రంథంలో సుమారు ముప్పైఅయిదు అలంకారాల లక్షణాలు, ఆ అలంకారాలలోని వివిధ ప్రకారాలు, వాటి లక్ష్యాలు చూపబడ్డాయి. ఈ అలంకారాల లక్షణాలు చాలా సంస్కృతాలంకారాల గ్రంథాలలో ఆయా అలంకారాల లక్షణాలతో పోలిఉండడం గమనించదగిన విషయం. ఇక, ఆళ్వార్ల పాశురాలలోని కొన్ని మనోహరాలైన అలంకారాలు ప్రస్తావింపబడతాయి.

1. **స్వభావోక్త్యలంకారం:**

వ్యక్తులు, వస్తువులు, ప్రదేశాలు మొదలైనవాని స్వభావాన్ని అందంగా వర్ణించడానికి స్వభావోక్త్యలంకారమని పేరు. **"స్వభావోక్తి రసాచారుయధావద్వస్తు వర్ణనం"** అనేది ఈ అలంకార

లక్షణం. వస్తు స్వభవాన్ని యథాతథంగా పల్కడంలో ఏమి విశేషమున్నది? – అంటే, ఆ స్వభావాన్ని వర్ణించడంలోని వైలక్షణ్యం వల్ల ఒక చమత్కృతి భాసిస్తుంది కనుక స్వభావోక్తి కూడా అలంకారమే అని అలంకారికుల అభిప్రాయం. చందాలోకంలో జయదేవుడు పల్కిన "**స్వభావోక్తి రసౌ చారు యథావత్ వస్తు వర్ణనమ్**" అనే లక్షణాన్ని ఇక్కడ గమనించాలి. అయితే, ఈ అలంకారాన్ని అందంగా ప్రయోగించడం చాలా కష్టం. దీనికి తమిళ సాహిత్యంలో "**తన్మైయణి**" అని పేరు. "**తన్మై**" అంటే స్వభావం. "తన" స్వభవమే "తన్మై". దండి అలంకార గ్రంథంలో ఈ అలంకార లక్షణం "**ఎవ్వకైప్పొరుళు మెయ్ వకైవిళక్కుం శొన్మఱైతొడుప్పదు తన్మైయాకుమ్**" (ఏ వస్తువు స్వభావాన్ని అయినా యథాతథంగా పలికే ఉక్తి వైఖరిని ప్రయోగించడం స్వభావోక్తి అనబడుతుంది) అని దీని భావం. ఈ అలంకారం నాల్గు ప్రకారాలుగా – అంటే – "**పొరుళ్ తన్మై**" (వస్తు స్వభావం), "**గుణత్తన్మై**" (గుణ స్వభావం), "**శాదిత్తన్మై**" (జాతి స్వభావం), "**తొళి*ఱ్ఱ*న్మై**" (క్రియా స్వభావం) అని నాల్గు విధాలుగా వర్గీకరింపబడింది.

ఆ*ళ్వా*ర్లలో ముదలా*ళ్వా*ర్లు అనబడే 'పొయ్ కై ఆ*ళ్వా*ర్లు', 'పూదత్తా*ళ్వా*ర్లు', 'పేయా*ళ్వా*ర్లు' – అనే ముగ్గురు సమకాలీనులు. ఆ*ళ్వా*ర్లలో కాలాన్ని బట్టి ముందువారు. వీరి పాశురాలు సహజవర్ణనలతో వాల్మీకి, కాళిదాసాది మహాకవుల సూక్తులను స్మరింపజేస్తాయి. పూదత్తా*ళ్వా*ర్లు '**ఇరణ్డామ్ తిరువన్దాది**' ప్రబంధంలోని 75వ పాశురంలో వేఙ్కటాద్రిలోని గజదంపతుల విహారాన్ని సహజరమణీయంగా స్వభావోక్తి ప్రక్రియలో ప్రస్తుతించారు. **వేఙ్కటాచల మాహాత్మ్యం**లో పద్మావతీ శ్రీనివాసుల ప్రథమ సమాగమానికి గజసంచారమే కారణం కావడాన్ని స్మరించవచ్చు. పూదత్తా*ళ్వా*ర్ల పాశురం ఈ క్రింది విధంగా ఉన్నది.

**పెరుకుమతవే*ళ*మ్ మాప్పిడిక్కు మున్నిన్టు**
**ఇరుకణిళ మూఙ్గిల్ వాఙ్గి – అరుకిరున్ద**
**తేన్ కలన్దు నీట్టుమ్ తిరువేఙ్గడమ్ కణ్డీర్**
**వాన్ కలన్ద వణ్ణన్ వరై.**

'తన యౌవనదశలో, గండస్థలాలనుండి మదజలం స్రవిస్తున్న ఒక మగ ఏనుగు, తనకు ప్రియమైన పెంటి ఏనుగుతో కలసి వేఙ్కటాద్రిపై విహరిస్తున్నది. తన ప్రేయసిని సంతోషింపజేయగోరింది, మగ ఏనుగు. అది ఆడ ఏనుగు ముందు నిలచి, దగ్గరలో ఉన్న ఒక తీయని లేత వెదురు గడను విరిచి, దానిని సమీపంలో ఉండే పూల తేనెలో ముంచి, దానిని మరింత మధురంగా చేసి, ఆడ ఏనుగుకు అందిస్తున్నది. ఇటువంటి మనోహర సన్నివేశాన్ని కల్గిన వేఙ్కటాద్రి మేఘవర్ణుడైన శ్రీనివాస భగవానునకు నివాసస్థానమైన కొండ' – అని ఈ పాశుర భావం.

ఈ పాశురంలో ప్రస్తావింపబడిన గజదంపతుల విహారం సహజమైనది. ఏనుగులకు లేత వెదుళ్ళు ఇష్టమైన ఆహారం. మదించిన గజం పెంటి ఏనుగును వెంబడించడం కూడా సహజమే. వీటి ప్రేమ పూర్వకమైన ప్రవృత్తి జాతికి తగినట్లు సహజంగా వర్ణింపబడినందున ఈ పాశురం **"శాదిత్తన్మై"** అనే స్వభావోక్త్యలంకార ప్రకారంగా గ్రహించవచ్చు. ఈ పాశురంలో వర్ణింపబడిన గజసంచారం సామాన్య గజసంచారం కాదని, గజరూపంలో లక్ష్మీనారయణులే విలాసంగా సంచరిస్తున్నారనేది ఆ*ఝ్*వారుల భావన. ఆ*ఝ్*వార్ల పాశురాలలో కనిపించే పిక, శుక, హంస, భ్రమర, మయూర, గజాదులు కేవలం తిర్యక్కులు కావని, అవి భగవద్రూపాలకు, భాగవతరూపాలకు, ఆచార్యరూపాలకు ప్రతీకలే – అని కదా పూర్వాచార్యులు వ్యాఖ్యానించారు.

ఈ సందర్భంలో ఇంకొక సాంప్రదాయికమైన, పరంపరాప్రాప్తమైన ఐతిహ్యం స్మరణీయం. ఈ పాశురంలోని మగ ఏనుగు శ్రీరామానుజులే. **"మాప్పిడి"** అని నిర్దేశింపబడిన ఆడ ఏనుగుద్వారా వారికి ప్రియమైన శిష్యులు లక్షింపబడతారు. శ్రీరామానుజులను తిరువరంగత్తముదనార్ **ఇరామానుశనూ*ఱ్ఱ*న్దాది** ప్రబంధంలోని **"పణ్డరుమాఱన్"** అనే 64వ పాశురంలో **"ఇరామానుశమునివే*ఴ*మ్"** అని మదగజంగా అభివర్ణించారు. ఆచార్యుని నాయకునిగా, వారి శిష్యులను నాయకిగా సంభావించి పల్కడంకూడా సాంప్రదాయికమే. దీనిని **శడకోపరన్దాది** మొదలైన తమిళ గ్రంథాలలో గమనించవచ్చు (శడకోపరన్దాది ప్రబంధంలో కంబమహాకవి నమ్మా*ఴ్*వార్లను నాయకస్థానంలోను, తమను నాయకీ స్థానంలో భావించి పలు

పాశురాలను రచించారు). ఈవిధంగా భావించినపుడు, భగవద్రామానుజులు వేఙ్కటాద్రిపై తమ ప్రియశిష్యులను ఉద్దేశించి చేయబోయే మధురమైన ఉపదేశాన్ని చేసిన ఒక సందర్భం ఇందులో సూచింపబడినది – అని ఒక సాంప్రదాయికమైన వివరణ ఉన్నది.

ఈ పాశురంలోని **"ఇరు కణ్ ఇళమూఙ్గిల్"** (రెండు కణుపులను కల్గిన లేత వెదురు) అనే పదం రెండు ఖండాలను కల ద్వయ మంత్రన్ని లక్షిస్తుంది. **"అరుకు ఇరున్ద తేన్"** అనే పదం ద్వయమంత్రార్థానికి పర్యంతసీమ అయిన 'ఆచార్యులే ఉపాయం, వారి కైంకర్యమే పరమార్థ'మనే అర్థాన్ని సూచిస్తుంది. ఆచార్యులే ఉపాయోపేయాలనే చరమపర్వ నిష్ఠ మిక్కిలి మధురమైనది కనుక, అది ఇక్కడ తేనెగా భావింపబడింది. శ్రీరామానుజులు తిరుమలపై తమ ప్రియ శిషులను ఉద్దేశించి ద్వయార్థాన్ని, దాని చరమసీమ అయిన ఆచార్యుల విషయంలోని శేషత్వ, పారతంత్ర్యాలతో మేళవించి ఉపదేశించబోతారనే ఐతిహ్యం ఇక్కడ ఆ*ళ్*వార్లు తమ సూక్తి ద్వారా సూచించారు. మహర్షికల్పులు, దివ్యసూరుల అంశతో అవతరించిన ఆ*ళ్*వార్లు భవిష్యద్రష్టలు కావడంలో అడ్డులేదు కదా!

ఇక్కడ ఇంకొక విధమైన, పెద్దలుచేసే సమన్వయంకూడా ఉన్నది. **"తమి*ళ్* మఱైకళ్ ఆయిరముమ్ ఈన్ద ముదల్ తాయ్ శడకోపన్, మొయ్ మ్బాల్ వళర్త ఇదత్తాయ్ ఇరామానుశన్"** (ద్రావిడవేదమైన వేయిపాశురాలను కన్న తల్లి నమ్మా*ళ్*వార్లు; వాటిని పెంచిన హితపరురాలైన తల్లి శ్రీరామానుజులు) అని భట్టర్ పల్కినట్లుగా శ్రీరామానుజులు తిరువాయ్ మొ*ళి* ప్రబంధాన్ని పలువిధాలైన రస్యవివరణలను చేయడంద్వారా, తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ చేత వ్యాఖ్యానిపంపజేయడం ద్వారా కాపాడి, వ్యాపింపజేశారుకదా! తిరువాయ్ మొ*ళి* ప్రబంధం ద్వయార్థప్రతిపాదకమని పూర్వాచార్యుల అభిప్రాయం. పలువురు పూర్వాచార్యులు ఆ దృష్టిలో వ్యాఖ్యానించారు. అందువల్ల ప్రకృతపాశురంలోని "రెండు కణుపులను కల లేత వెదురు" అనేది ద్వయమంత్రార్థాత్మకమైన తిరువాయ్ మొ*ళి* ప్రబంధాన్ని తెల్పుతుంది. "సమీపంలో ఉండే తేనె" అనే పదం ద్వయానికి ఇరువైపుల (ముందు, తరువాత) ఉండే తిరుమంత్ర, చరమశ్లోకాల అర్థాన్ని ప్రతిపాదించే ముదలాయిరం, పెరియతిరుమొ*ళి*, ఇయఱ్పా అనే మూడు విభాగాలను

సూచిస్తుంది. శ్రీరామనుజులు అంగి ప్రబంధమైన తిరువాయ్ మొழி ప్రబంధాన్ని – దానికి అంగాలుగా చెప్పబడే మిగిలిన ప్రబంధాలతో కలిపి సమన్వయిస్తూ ప్రవచించడం ఈ పాశురంలో సూచింపబడుతున్నది. ఇది, శ్రీరామానుజులు ద్రావిడవేదాన్ని విశేషంగా వ్యాపింపజేశారు – అనే విషయాన్ని సూచిస్తుంది.

ఇక, శ్రీరామానుజుల విషయంలోనే ఇంకొక విలక్షణమైన సమన్వయాన్ని కూడా ఈ పాశురంలో సంభావించవచ్చు. శ్రీరామానుజులు వేఙ్కటాచలంపై వేంచేసి ఉన్నపుడు శ్రుతివాక్యసమన్వయరూపమైన **వేదార్థసంగ్రహమనే** గ్రంథాన్ని ఉపన్యాసరూపంగా తమ ప్రియశిష్యులకు అనుగ్రహించారని సాంప్రదాయికమైన కథనం. వేదంలో కొన్ని వాక్యాలు ఆత్మ–పరమాత్మల భేదాన్ని తెలుపుతున్నాయి. **"క్షరం ప్రధానమమృతాక్షరం హరః, క్షరాత్మానా వీశతే దేవ ఏకః"** (నశించే స్వభావాన్ని కల్గినది ప్రకృతి; నాశం లేని అక్షరరూపమైనది ఆత్మ. ఈ రెండిటిని అద్వితీయుడైన దేవుడు శాస్తున్నాడు) ఇత్యాది వాక్యాలు ఇటువంటివి. వీటికి భేదశ్రుతులని పేరు. **"ఐతదాత్మ్య మిదం సర్వమ్"** (ఈ జగత్తు అంతా పరమాత్మను ఆత్మగా కల్గినది) ఇత్యాది వాక్యాలు అభేదశ్రుతులు. **"య ఆత్మని తిష్ఠన్...య మాత్మా న వేద"** (ఎవడు ఆత్మలో ఉండేవాడై....ఎవనిని ఈ ఆత్మ తెలియడంలేదో), **"అనేన జీవేనాత్మనానుప్రవిశ్య"** (ఈ జీవుని ద్వారా అనుప్రవేశించి) ఇత్యాది వాక్యాలు ఘటకశ్రుతులు. ఘటకశ్రుతులంటే భేదాభేదశ్రుతులను సమన్వయపరచే శ్రుతులు. భగవద్రామానుజులు వేదార్థసంగ్రహంలో, అర్థంలో పరస్పరవిరుద్ధంగా భాసించే భేదశ్రుతులు, అభేదశ్రుతులనే రెండు విధాలైన వేదవాక్యాలను ఘటకశ్రుతుల ద్వారా సమన్వయించి, సర్వశ్రుతి సమన్వయన్ని చేశారు. వేదమంతా ప్రమాణమేనని నిరూపించారు. ఈవిషయం ప్రస్తుత పాశురంలో సూచింపబడినది అనవచ్చు. **"ఇరుకణ్ ఇళ మూఙ్గిల్"** అనే ప్రయోగం రెండు విధాలుగా ఉండే భేదాభేదశ్రుతులను, **"అరుకిరున్ద తేన్"** అనే ప్రయోగం ఘటకశ్రుతులను తెలుపుతుంది. వెదురుకర్రను తేనెలో ముంచి ఇవ్వడమంటే – భేదాభేదశ్రుతులను ఘటకశ్రుతుల ద్వరా సమన్వయపరచి, సర్వశ్రుతులకు ప్రామాణ్యాన్ని మధురంగా నిర్వహించడమే – అనే విషయం ఈ పాశురం ద్వారా సూచింపబడింది.

ఈవిధంగా ఉదాహృతమైన పూదత్తాழ்వార్ల పాశురంలో ప్రకృతమైన గజదంపతీ వృత్తాంతం వాచ్యం. ఆ తరువాత వివరింపబడిన దివ్యదంపతుల వృత్తాంతం, భగవద్రామానుజులకు సంబంధించిన వృత్తాంతాలు పాశురంలోని ఆయా పదాల ప్రయోగంవల్ల ధ్వనిస్తున్నాయి. అందువల్ల ఇవి **"సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్"** (ప్రస్తుత వృత్తాంతం ద్వారా అప్రస్తుత వృత్తాంతం ధనిస్తే అది సమాసోక్తి అనబడుతుంది) అనే లక్షణాన్ని కల **సమాసోక్త్యలంకారం** ధ్వనిస్తున్నది అని చెప్పవచ్చు. ఆழ்వార్ల సూక్తులు అందమైన, గంభీరమైన భావాలను ఆలంకారికంగా వ్యక్తం చేస్తాయి – అనేదానికి ఇది ఒక ఉదాహరణం మత్రమే. ఇక, వ్యాసవిస్తృతిభీతి వల్ల మఱి కొన్ని అలంకారాలు సంగ్రహంగా ప్రస్తావింపబడతాయి.

(2) క్రమాలంకారం:

చంద్రాలోకంలో ఈ అలంకారం **"యధాసంఖ్యం క్రమేణైవ క్రమికాణాం సమన్వయః"** (నిర్దేశించిన కొన్ని విషయాలకు సంబంధించిన అంశాలను క్రమానుసారంగా అన్వయించి పలికితే అది **యథాసంఖ్యాలంకరం** – అంటే – క్రమాలంకారమనబడుతుంది) అని లక్షింపబడింది. ఒక నిర్దిష్టమైన క్రమంలో విషయాలను, వాటికి సంబంధించిన అంశాలతో అందంగా సమన్వయించడంలో అపూర్వమైన చమత్కృతి భాసిస్తుంది కనుక, దీనిని కూడా అలంకారికులు ఒక విలక్షణమైన అలంకారంగా గుర్తించారు. లోకంలో కూడా ఇటువంటి క్రమానుగుణమైన వస్తు సమన్వయంలో రమణీయత గోచరించడం ప్రత్యక్షానుభవసిద్ధం.

ద్రావిడ భాషలో ఈ అలంకారానికి **"నిరనిఱై యణి"** అని పేరు. దండి అలంకారగ్రంథంలో ఇది **"నిరనిఱుత్తియత్తుత నిరనిఱై యణియే"** (శబ్దార్థాలను క్రమానుసారంగా నిలిపి అర్థాన్ని గ్రహించడం – నిరనిఱైయణి) అని లక్షింపబడింది. పొయ్ గై ఆழ்వార్ల **ముదల్ తిరువన్దాది** ప్రబంధంలోని ఈ క్రింది పాశురంలో క్రమాలంకారం మనోహరంగా ప్రయోగింపబడింది.

**అరవ మడల్ వేழ ம் ఆజ్గురున్దుమ్ పుళ్ వాయ్**

**కురవైకుడములై మఱ్కున్ఱమ్ – కరవిన్ఱి**

**విట్టిరుత్తు మెయ్ త్తొశిత్తు క్కీణ్డు కోత్తాడి,**
**ఉణ్డెట్టెడుత్త శేజ్గణవన్.**

(కాళీయుని మడుగు నుండి బయటకుపంపి, యుద్ధానికి వచ్చిన కువలయాపీడమనే ఏనుగును భగ్నం చేసి, పశువులను మేపి, గురువిందచెట్టును విరిచి, బకాసురుని నోరును చీల్చి, రాసక్రీడలో గోపికల చేతులను పట్టుకొని, ఘటనర్తనాన్ని చేసి, పూతన స్తన్యాన్ని ఆరగించి, మల్లులను చంపి, గోవర్ధనగిరిని ఎత్తిన ఎఱ్ఱని నేత్రాలను కలవాడతడు.)

ఈ పాశురంలో కర్మపదాలు, క్రియాపదాలు ఒక నిర్దిష్టమైన క్రమంలో కూర్పబడడంవల్ల క్రమలంకారం ఇందులో ప్రయోగింపబడిందని చెప్పవచ్చు. "అరవమ్ – విట్టు, అడల్ వేழమ్ – ఇఱుత్తు, ఆన్ – మేయ్ త్తు, కురున్దమ్ – ఒశిత్తు, పుళ్వాయ్ – కీణ్డు, కురవై – కోత్తు, కుడమ్ – ఆడి, ములై – ఉణ్డు, మల్ – ఆట్టు, కున్ఱమ్ – ఎడుత్త" అని ఈ పదాలకు క్రమేణా అన్వయం. ఈ పాశురంలో క్రమాలంకారం ఉన్నదని పెరియవాచ్చాన్ పిళ్ళై తమ వ్యాఖ్యలో **"ఇప్పాట్టు – నిరల్ నిఱై"** అని అనడం ద్వారా తెలిపారు.

## (3) ఉదాత్తాలంకారం:

**"ఉదాత్తం వస్తు నః సంపత్ మహతాంచోపలక్షణమ్"** అని చంద్రాలోకం ఈ అలంకారాన్ని లక్షించింది. వస్తువు సమృద్ధి ఆశ్చర్యకరంగా, చమత్కారాన్ని కల్గించే రీతిలో వర్ణింపబడితే, గొప్పవారి ఔదార్యం వర్ణింపబడితే, అక్కడ ఉదాత్తాలంకారం భాసిస్తున్నదని చెప్పవచ్చు. దండి అలంకారంలో దీని లక్షణం ఈ రీతిలోనే తెలుపబడడం గమనించవచ్చు. **"వియత్తుకు శెల్వము మేమ్పడు ముళ్ళముమ్ ఉయర్ చ్చి పునైన్దురైప్పదు ఉదాత్తమాకుమ్"** (ఆశ్చర్యాన్ని కల్గించే సంపదను, ఉన్నతమైన మనస్సును, గొప్పగా వర్ణించడం ఉదాత్తం) అని దండి ఈ అలంకారాన్ని నిర్వచించారు. తమిళభాషలో దీనికి **"వీఱు కోళణి"** అని పేరు.

**తిరుప్పావై** ప్రబంధంలోని పలు సూక్తులు ఈ ఉదాత్తలంకారానికి లక్ష్యాలు. **"ఓజ్గీ ఉలకళన్ద"** అనే పాశురంలోని **"తీజ్గిన్ఱి నాడెల్లామ్ తిజ్గళ్ ముమ్మారు పెయ్ దు ఓజ్గు పెరుమ్ శెన్నెల్**

**ఊడు కయలుకళ, పూమ్ కువళైప్పోదిల్ పొటి వణ్డు కణ్పడుప్ప తేజ్గాతే పుక్కిరున్దు శీర్త ములై ప***ఱ్ఱి***వాజ్గ, కుడల్ నిఱైక్కుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్ నీజ్గాద శెల్వమ్ నిఱైన్దు"** (ఏ కీడు లేకుండా దేశమంతటా వర్షాలు నెలకు మూడు మార్లు కురిసి, ఉన్నతంగా పెరిగిన అందమైన ఎఱ్ఱని పైరు నడుమ గల జలసమృద్ధిలో బలిసిన చేపలు అటుఇటు పొరలగా, అక్కడ పూచిన కలువ పూలలో అందమైన తుమ్మెదలు నిద్రిస్తూ ఉండగా, ఆగకుండా ఎల్లప్పుడూ బలమైన పొదుగును పట్టి పాలను పితికినా, నిరంతరం పాలను వర్షిస్తూ కుండలను నిండించే ఔదార్యగుణాన్ని కల పశువులతో, ఏనాటికీ తరగని, నశించని సంపద నిండగా) అనే సూక్తిలో ఈ వస్తుసమృద్ధి అత్యంత మనోహరంగా వర్ణింపబడింది కదా.

**"మహతాం చోపలక్షణమ్"** అనే ఉదాత్తాలంకార ప్రకారాన్ని **"అమ్బరమే తణ్ణీరే శోఱే అఱమ్ శెయ్యుమ్ ఎమ్బెరుమాన్ నన్దగోపాలా!"** (వస్త్రదానం చేస్తే వస్త్రదానాన్ని మాత్రమే చేసేవాడా ఇతడు! అనే విధంగా ఎంతో ఔదార్యంతో ఆ దానాన్ని చేసేవాడవు; పానీయాన్ని దానం చేస్తే, అన్నదానం చేస్తే – ఇంతకుమించి ఎవ్వరూ ఎక్కువగా ఈ దానాలను ఎవరూ చేయలేరు – అనేరీతిలో ఆ దానాలను చేసేవాడవైన, మా స్వామివి అయిన నందగోపాలా!) అనే తిరుప్పావై సూక్తిలో, **"అలమ్ పురిన్ద నెడుమ్ తడక్కై"** (ప్రతిగ్రహీతలకు 'ఇకచాలు' అని అనిపించేటట్లుగా దానం చేసే దీర్ఘమైన హస్తాన్ని కలవాడు) అనే తిరుమంగై ఆ*ళ్వా*ర్ల **తిరునెడున్దాణ్డకమ్** సూక్తిలో, **"ఉన్ అడియార్కు ఎన్ శెయ్ వన్? ఎన్ఱే ఇరుత్తి నీ"** (నీ దాసులకు పరమపురుషార్థమైన మోక్షాన్ని ఉదారంగా ఇచ్చినా, 'ఇంకా ఇంకా వీరికి ఏమేమి ఇవ్వగలను?' అనే ఆతురుతతో నీవుంటావు) అనే నమ్మా*ళ్వా*ర్ల **పెరియతిరువన్దాది** సూక్తిలోనూ గమనించవచ్చు.

## (4) ఆక్షేపాలంకారం:

**"ఆక్షేపః స్వయముక్తస్య ప్రతిషేధో విచారణాత్, చంద్ర సందర్శయాత్మాన మథవాస్తి ప్రియాముఖమ్"** అని చంద్రాలోకంలో ఈ అలంకారానికి లక్ష్యలక్షణాలు తెలుపబడ్డాయి. తాను

పల్కిన మాటనే, తరువాత విచారించి నిషేధిస్తే ఆక్షేపాలంకారమవుతుంది. క్షేపమంటే పక్కకు నెట్టడమని అర్థం. దీనికే **ప్రతిషేధాలంకార**మని కూడా పేరు.

దీనిని ద్రావిడభాషాలంకారికులు **"మున్నవిలక్కణి"** అని వ్యవహరిస్తారు. పూర్వం పల్కిన దానిని కాదనడమని ఈ నామంలోని భావం. దండి అలంకార గ్రంథంలో ఈ అలంకార లక్షణం **"మున్నత్తిన్ మఱుప్పినదు మున్నవిలక్కే, మూవకైక్కాలము మేవియదాకుమ్"** అని నిర్వచింపబడింది. పూర్వం చెప్పిన అర్థాన్ని కాదనడం ఆక్షేపం. ఈ నిషేధం శబ్దతః, అర్థతః కూడా చేయబడవచ్చుననే అర్థం **"మఱుప్పిన్"** అనే పదప్రయోగం ద్వారా వస్తుంది – అని దీని వివరణకారులన్నారు. ఈ విధంగా ద్వివిధమైన ఈ అలంకారం భూత భవిష్యద్వర్తమానకాలాలకు సంబంధించిన అర్థాన్ని ఆక్షేపించడమనే అవాంతరవిభాగాల వల్ల మొతం ఆఱు ప్రకారాలు అవుతుంది.

భూతకాలికమైన, అర్థంద్వారా నిషేధాన్ని సూచించే ఈ అలంకార ప్రకారం పొయ్ కై ఆఴ్వార్ల **ముదల్ తిరువన్దాది** ప్రబంధంలోని **"పాలన్ తనదురువాయ్"** అనే 69వ పాశురంలో గోచరిస్తుంది.

**పాలన్తనదురువాయ్ ఏ౯ఴులకుణ్డు, ఆలిలైయిన్**
**మేలన్రు నీ వళర్ న్ద మెయ్యెన్బర్ – ఆలన్రు**
**వేలై నీరుళ్ళదో! విణ్ణదో! మణ్ణదో!**
**శొలైశూఴ్ కున్రెడుత్తాయ్ శొల్లు!**

(తోటలను చుట్టూకల గోవర్ధనగిరిని ఎత్తినవాడా! నీవు చిన్న శిశువుగ మాఱి, ఏడులోకాలను ఈ ఉదరంలో గ్రహించి, లేత మఱ్ఱి ఆకుపై ఆ సమయంలో, ప్రళయకాలంలో, శయనించడం యథార్థమని అంటారు. మఱి, ఆ మఱ్ఱి ఆకు ప్రళయజలంలో ఉన్నదా? ఆకాశంలో ఉన్నదా? భూమిపై ఉన్నదా? ఎక్కడ ఉన్నదో తెలుపు!)

ఈ పాశురంలో – లోకాన్ని అంతటిని భగవంతుడు మింగిన ఆ ప్రళయ సమయంలో మఱ్ఱి ఆకు ఉన్నది – అని అనడం అసంభావితంగా తోస్తున్నది – అనే అర్థాన్ని శబ్దతః

ప్రతిషేధించకుండా, అర్థం ద్వారా ప్రతిషేధించినందున, భూతకాలానికి చెందిన, అర్థతః సూచింపబడిన ఆక్షేపాలంకారం అవుతుంది. **"శోలై శూఴ్ కున్ఱెడుత్తాయ్ శొల్లు"** అని అనడం ద్వారా ఆశ్చర్యకర చేష్టలను చేసేవానికి, ఇది కూడా పొసుగుతుంది – అనే అర్థాన్ని ధ్వనింపజేస్తూ, భగవానుని మహిమను సూచించినట్లయినది. ప్రళయమనేది గడచిన కాలానికి చెందినది కనుక, ఆ కాలానికి చెందిన వృత్తాంతం ఇక్కడ ప్రస్తావింపబడి నిషేధింపబడినందున ఈ ఆక్షేపం భూతకాలికమైనది. ఈ ఆక్షేపం శబ్దం ద్వారా చేయబడలేదు; అర్థం ద్వారా సూచింపబడింది. దండి అలంకార గ్రంథంలో కూడా ఈ పాశురం ముందు తెల్పిన ఆక్షేపాలంకార ప్రకారానికి ఉదాహరణగా చూపబడడం గమనార్హం.

## (5) ఉపమాలంకారం:

ఉపమాలంకారం పలు అలంకారాలకు ప్రకృతి అని అలంకారికుల అభిప్రాయం. ఈ అలంకారమే కొద్ది భేదాలతో వేఱు వేఱు అలంకారాలుగా భాసిస్తుంది. ఈ అలంకారానికి ఉండే ప్రాధాన్యం ఇక ఏ అలంకారానికీ లేదనే చెప్పాలి. వాల్మీకి మహర్షి, కాళిదాస మహాకవి ఈ అలంకార ప్రయోగంలో సిద్ధహస్తులు. **"ఉపమా కాళిదాసస్య"** అని కదా ప్రసిద్ధి! ఈ అలంకార నిర్వహణం చాలా కష్టం కూడా.

ఈ సందర్భంలో తిరుప్పావై ప్రబంధంలోని ఒక అద్భుతమైన ఉపమాలంకార విశేషాన్ని ప్రస్తావించి వ్యాసాన్ని ముగిస్తాను.

గోదాదేవి **తిరుప్పావై** ప్రబంధంలోని **"అఙ్గణ్ మాఞాలమ్"** అనే పాశురంలో శీకృష్ణ భగవానుని నిద్రలేపుతున్నది. నిద్ర నుండి మేల్కొనే స్వామి నేత్ర సౌందర్యాన్ని సంభావిస్తూ **"కిఙ్కిణివాయ్ చ్చెయ్ ద తామరప్పూప్పోలే శెమ్ కణ్"** అని ఒక విలక్షణమైన ప్రయోగాన్ని చేసింది. స్వామి నిద్ర నుండీ మేల్కొని, ఒక్కసారిగా నేత్రాలను పూర్తిగా తెఱచి, పరిపూర్ణ కటాక్షాలను తమపై ప్రసరింపజేస్తే, ఆ నేత్ర సౌందర్యాన్ని అంతటిని ఒక్కసారిగా అనుభవించే శక్తి తమకు లేదని, అందువల్ల స్వామి నేత్రాలను కొంచెం కొంచెంగా తెరుస్తూ, కటాక్షాలను మెల్లి మెల్లిగా తమపై

సారిస్తే, అపుడు ఆ నేత్రాల సొబగును కొంచెం కొంచెంగా, క్రమక్రమంగా అనుభవించే అవకాశం ఉంటుందని సూచిస్తూ, గోదాదేవి ఆ విధంగా స్వామిని తన నేత్రాలను తెరువమని అంటున్నది. ఈ విధంగా ఉండే స్వామి అరమొద్దుకన్నులకు సగం విచ్చుకొన్న తామరపూలను ఉపమానంగా పలికే ముందు, గోదాదేవి ఆ తామరపూలను మువ్వలతో పోలుస్తున్నది. పాదాలకు అలంకరించుకొనే మువ్వలు ఆకారసన్నివేశంలో కూడా ఆ విధంగా సగం తెరచుకుని, సగం మూసికొన్న రీతిలో కదా ఉంటాయి. అందువల్ల శ్రీకృష్ణుని నేత్రాలకు సగం వికసించిన తామరపూవు ఉపమానమైతే, ఆ తామరకు మువ్వలు ఉపమానం. ఈ విధంగా ఇక్కడ ఉపమానం ఉపమితమైనది కనుక **"ఉపమితోపమా"** అనే ఒక విలక్షణమైన అలంకారం గోదాదేవి శ్రీసూక్తిలో భాసిస్తున్నది అని చెప్పవచ్చు.

మహర్షికల్పులైన ఆళ్వార్ల పాశురాలలోని విశేషణ, విశేష్యపదాలన్నీ ప్రకరణానుగుణాలు. పూర్వచార్యులు వాటిని ఆ విధంగానే వ్యాఖ్యానించారు కూడా. అందువల్ల సాభిప్రాయ విశేషణ, సాభిప్రాయ విశేష్యరూపాలైన పరికర–పరికరాంకురాలంకారాలు దివ్య ప్రబంధాలలో సర్వత్రా గోచరిస్తాయి. **"న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే"** అని శృతి కీర్తించే భగవానునకు సాటి వచ్చే ఉపమానమేదీ లేదు కనుక, దివ్యప్రబంధ సూక్తులలోని పలు ప్రయోగాలలో ఉపమేయాధిక్యరూపమైన వ్యతిరేకాలంకారం కనిపిస్తుంది. ఉత్ప్రేక్షలు, రూపకాలు, అర్థాంతర న్యాసం మొదలైన అలంకారాలకు ఎన్నిటికో ఆళ్వార్ల పాశురాలు అందమైన లక్ష్యాలు. విస్తరభయంతో ఏతావన్మాత్రంగా ఈ వ్యాసం విరమింపబడుతున్నది.

※※※※※※※※※※※※※※